# YATEENDRA GEETHA SARAM

By

**Dr. S. DASARATHA**

FIRST EDITION : June 1996

COPIES : 1000

PRICE : 40-00

తిరుమల తిరుపతి దేవస్థానం వారి ధార్మిక గ్రంథ రచయితలకు ఆర్థిక సహాయ పథకం క్రింద ముద్రించబడింది.

***PUBLISHED BY***

**Samudrala Publications**

2-17 Ranga Reddy Building
M.R. Palli, Tirupati.

***PRINTED BY***

**Adayar Students Xerox**
145/21, Prakasam Raod
Tirupati -7

# ఆకాంక్ష

చిరంజీవి ఎస్. దశరథ రచించిన "యతీంద్ర గీతాసారం" ఆమూలాగ్రం చదివాను. వస్తు ప్రతిపాదనలోను, వేదాంత వివేచనంలోను విశ్లేషణాత్మకంగా సాగిన ఈ పరిశోధన నన్నెంతో ముగ్ధుణ్ని చేసింది. ఒక సాహిత్య ప్రక్రియగా గీత సంతరించుకొన్న విధానాన్ని హృద్యంగా ఇందులో విశదీకరించడం జరిగింది.

భారతీయ వాఙ్మయంలో భగవద్గీతకు ఒక విశిష్ట స్థానం వుంది. మలయాళ యతీంద్ర గీత కూడా మన అధ్యాత్మ సంపదకు నిలయం. శంకర భగవత్పాదులు, భగవద్రామానుజుల వంటి మహాపురుషుల కోవలో శ్రీ మలయాళ యతీంద్రులవారు కూడ అనన్య సామాన్యమైన వాఙ్మయ తపస్సు చేశారు. తన వాఙ్మయ తపస్సుతో ఎన్నో అక్షర కుసుమాలు సృజించారు. జ్ఞానగంధాలు విరజిమ్మే ఆ కుసుమాల్లో యతీంద్ర గీత కూడ ఒకటి.

భారతీయ వేదాంత పరిభాష చాలా గహనమైన అంశం. కాని శ్రీ మలయాళ యతీంద్రుల వారి ప్రతిపాదనల్లో ఎంతటి గహనమైన అంశమైనా సుప్రసన్న వివేచనా భరితమై సామాన్యునికి సైతం ఆనందదాయకమవుతుంది.

శ్రీ మలయాళ యతీంద్రుల వారి యతీంద్ర గీతాంశాలను స్పష్టంగా, నిర్దుష్టంగా వివేచనం చేయడంలో యస్. దశరథ సఫలీకృతుడైనాడు. యతీంద్ర గీతాంతర్గత వైశిష్ట్యాన్ని హృద్యంగా ఆవిష్కరింపదగిన జ్ఞానసంస్కారం ఈయనలో వుంది. ఇందులోని అధ్యాయాలన్నీ ఆ అంశాన్ని ధ్రువీకరిస్తున్నాయి. భగవద్గీతకు, యతీంద్ర గీతకు వున్న సాధర్మ్యవైధర్మ్యాలు చాలా విపులంగా చర్చించారు. భక్తి, వైరాగ్యం, జ్ఞానం, సత్కర్మ వంటి విషయాల గురించి యతీంద్ర గీత ఆధారంగా ఈ వ్యాసకర్త సల్పిన వివేచన మిక్కిలి ప్రశంసనీయం. సరస్వతీ రహస్యోపనిషత్ వంటి ఉపనిషత్తుల నుండి కూడ ఆకరాలను చూపించి తన పరిశోధనాంశానికి వన్నె చేకూర్చారు.

ఈ చిరంజీవి ఇటువంటి ఎన్నో పరిశోధనాంశాలతో కూడిన వ్యాసాలు సృజింపగలడని ఆకాంక్షిస్తున్నాను.

డా. మేడసాని మోహన్
డైరక్టర్, అన్నమాచార్య ప్రాజెక్ట్
తిరుమల తిరుపతి

**తిరుపతి**
**18/5/96**

# ఆశంస

అపురూపము అసమానమైనది భారతీయాధ్యాత్మిక పరంపర. నిత్యచైతన్యంతో ప్రాణికోటిని పావనం చేస్తున్న గంగానది అది. ప్రవాహంలో కలిసే మలినాలను తొలగించేందుకుపయోగపడే సంజీవనీ మూలికల వంటివి మహాత్ముల జీవితాలు. అవి పాపపంకిలమవుతున్న మానవ జీవన స్రవంతిని ప్రక్షాళనం చేస్తాయి. పావనం చేయటం తప్ప మరో పనిలేని నిస్వార్థ కుసుమాలు. సౌరభ్యభరితాలు, దేశకాలాలకతీతాలు వారి జీవన విధానాలు.

తెలుగువారు చేసుకున్న పుణ్యఫలం శ్రీ మలయాళ స్వాములవారు ఆంధ్ర దేశంలో స్థిరపడటం. గంభీరము, గహనము, దురవగాహమయిన సనాతన భారతీయ ఆధ్యాత్మిక భావనలని తెలుగునుడికారంలో, సులభశైలిలో సామాన్య మానవునికి అందించిన ఘనత స్వాములవారిది. ఆకాశ గంగను నేలకు దించి తెలుగుగంగగా మార్చిన అపర భగీరథుడాయన. నిర్దిష్ట లక్ష్య సిద్ధితో తృప్తి పడక మరింత విస్తృత ప్రచారం ద్వారా భిన్న ప్రాంతీయులకు, భిన్న దేశీయులకు కూడా వుపయోగపడేలా, వారికి అందుబాటులో వుండే సంస్కృత భాషలోనికి తమ భోధనలని అనువదింపజేయడమన్నది వారి విశాలదృక్పథానికి నిదర్శనం. ఇది క్రొత్త ప్రక్రియ కాదు. పాళీ భాషలోని బుద్ధుని బోధనలు, కన్నడంలోని బసవని వచనాలు సంస్కృతం ద్వారా విశేష ప్రచారాన్ని పొందడం మనకు తెలిసిందే. రాజభాషగా వెలుగొందిన సంస్కృతంలో భావ జాలాన్ని బంధించడ మంటే ఒకరకంగా రాజముద్రను పొందడం లాంటిది. శ్రీ మలయాళ స్వాములవారి అటువంటి ప్రయత్న ఫలితమే శ్రీమలయాళ యతీంద్ర గీత.

శ్రీ మలయాల యతీంద్ర గీతను, అధ్యయన విషయంగా స్వీకరించి తన గురుఋణం తీర్చుకున్న అదృష్టవంతుడు చి. సముద్రాల దశరథ. గీత ప్రక్రియా ఆవిర్భావాన్ని ఆవిష్కరించి, 'శ్రీ మలయాళ యతీంద్ర గీత' వైశిష్ట్యాన్ని వివరించి, అందులోని ఆధ్యాత్మిక, సామాజిక విషయాల పూర్వాపరాలను చక్కగా సమగ్రంగా చర్చించడం గ్రంథకర్త వివేచనా శక్తికి తార్కాణం. కంటకావృత మార్గంలో పయనించి గమ్యం చేరడమన్నది, మార్గనిర్దేశం చేసినంత సులభం కాదు. కఠినమైనా

గమ్యాన్ని చేరి లక్ష్యాన్ని సాధించిన దశరథను మనసారా అభినందిస్తూ, అతని ద్వారా మరిన్ని ఆధ్యాత్మిక గ్రంథాలు తెలుగులో వెలుగు చూడాలని ఆశిస్తున్నాను.

డా. కె. ప్రతాప్

తిరుపతి — రీడర్, సంస్కృత విభాగం,

22-5-96 — శ్రీ వేంకటేశ్వర విశ్వ విద్యాలయం.

# నివేదన

ఆధ్యాత్మిక వాఙ్మయంలో గీతాసాహిత్యం చాలా విశిష్టమైనది. గీత అనగానే మనకు వెంటనే స్ఫురించేది భగవద్గీత. కాని ప్రాచీన వాఙ్మయంలోనే పలురకాల గీతలు కానవస్తున్నాయి.

ఈ గీతా రచనా ప్రక్రియ ననుసరించి ఆధునిక కాలంలో కూడా కొన్ని గీతలు సంస్కృత భాషలో ఉద్భవించాయి. వాటిలో ఒకటైన శ్రీ మలయాళ యతీంద్ర గీత యొక్క స్వరూపాన్ని నిరూపించడానికే ఈ గ్రంథం ఉద్దేశించబడింది.

వ్యాసాశ్రమ వ్యవస్థాపకులు శ్రీ మలయాళస్వాములవారు ఆంధ్ర దేశానికి చిరపరిచితులే. ఆధ్యాత్మిక క్షేత్రంలో వీరొక మహా విప్లవాన్ని వెలయించారు. స్వయంగా ఆత్మానుభూతిని, ఆత్మ సాక్షాత్కారాన్నీ పొందిన మహనీయులు కాబట్టే శ్రీవారి ప్రబోధాలు లక్షల కొలది ప్రజలపై ఎనలేని ప్రభావం చూపాయి.

శ్రీ స్వాములవారు అనుష్ఠాన రహితులైన శుష్క వేదాంతుల వాచా వేదాంతాన్ని నిశితంగా ఖండించారు. వర్ణవ్యవస్థ, నాలుగు యుగాలు, బ్రహ్మ విద్యపై అధికారం, ప్రణవోపాసన మొదలైన అంశాలపై వేలకొలది సంవత్సరాల నుండి హిందూ సమాజంలో నాటుకొనిపోయిన మూఢ విశ్వాసాలను పటాపంచలు చేశారు. ఇతరుల ఆత్మోన్నతిని అడ్డుకొనే సనాతనుల దుశ్చర్యలను, దుర్వాదాలను శాస్త్ర సమ్మత యుక్తులతోనే త్రోసిపుచ్చారు. సదాచారానికీ, సదనుష్ఠానానికీ తమ జీవితంలోనూ, ఆశ్రమంలోనూ ఎంతో ప్రాధాన్యమిచ్చారు. అందుకే శ్రీ స్వాములవారి జీవితం ''భగవద్గీతకు భాష్యం వంటిది''ని దివ్యజీవన సంఘ

స్థాపకులు శ్రీ స్వామి శివానంద సరస్వతీ మహరాజ్ వారు కీర్తించారు.

18 అధ్యాయాలతో, 1120 శ్లోకాలతో భగవద్గీతకే వ్యాఖ్యాన రూపంగా వున్న శ్రీ మలయాళ యతీంద్ర గీతపై పరిశోధన కొనసాగడం ముదావహం. ఈ కృషిలో చిరంజీవి సముద్రాల దశరథ కృత కృత్యులయ్యారు. శ్రీ మలయాళ స్వాముల వారి సమున్నతమైన ఆశయాలను, మహోన్నతమైన వ్యక్తిత్వాన్ని నిరూపించడంలో ఈ గ్రంథం చాలావరకూ కృత కృత్యమయింది.

శ్రీ దశరథను ఆదర్శంగా స్వీకరించి ఇంకా చాలామంది విద్యావంతులైన యువకులు పదివేల పుటలకు పైగా విస్తరించిన శ్రీ మలయాళ స్వాములవారి వాఙ్మయాన్ని చక్కగా పరిశోధించి ఆధ్యాత్మిక ప్రకాశాన్ని నలుదెసలా విస్తరింపచేయగలరని ఆశిస్తున్నాను.

తిరుపతి
**16-5-96**

సముద్రాల లక్ష్మణయ్య
కార్యదర్శి, ధర్మ ప్రచార పరిషత్
తిరుమల తిరుపతి దేవస్థానములు

# అభినందనలు

వేదవ్యాస మహర్షి రచించిన మహాభారతంలోని అంతర్భాగమే భగవద్గీత. అది ద్వాపర యుగం నాటి రచన. ఆ భగవద్గీతను ఆధారంగా చేసుకొని ''గీతా'' సాహిత్యం ఉద్భవించిందనుట సత్యదూరం కాదు. విష్ణుగీత, శివగీత, దేవీగీతలతో ఆరంభమైన ఈ గీతా సాహిత్యం రమణగీత, సాయిగీతల వరకు పయనించింది. ఆ కోవలోనిదే అయిన ''శ్రీ మలయాళ యతీంద్ర గీత'' ఇరవయ్యో శతాబ్దంలో - గీతా సాహిత్యంలో ఇది తనదైన ప్రత్యేకతను సంతరించుకొన్నది.

శ్రీ మలయాళ యతీంద్ర గీతకు భగవద్గీతకు సముద్రాల దశరథ చక్కని సమన్వయాన్నీ, భేద తారతమ్యాన్నీ నిరూపించి, పరిశోధనచేసి డాక్టరేటు పట్టందాకా ఎదిగాడు.

మన చుట్టూ ఉన్న సమాజంలోని దోషాలను, దురాచారాలను, మూఢవిశ్వాసాలను, వర్ణజాతి భేదాలను తొలగించడానికి తనవంతు కృషిచేసి, శ్రీ

వ్యాసాశ్రమం అనే వటవృక్షానికి బీజాంకురం వేసి, ఆత్మవికాసానికి బాటలు తీసి, స్త్రీలకు బ్రహ్మ విద్యను నేర్పి, జాతి భేదం పాటించకుండా కృతకృత్యులైన విప్లవవాది, బ్రహ్మవేత్త, సంఘసంస్కర్త శ్రీ మలయాళ యతీంద్రులవారు. ఈ గ్రంథంలో డా॥ దశరథ ఆ మహానుభావుణ్ణి సాక్షాత్కారింపచేశారు. రచయిత డా॥ దశరథ మలయాళ యతీంద్ర గీతలో అద్వైత భావాల్ని సామాన్య పాఠకునికి సైతం అందుబాటులో ఉండేలా సరళంగా ఉదాహరణలతో వెల్లడించడమేగాక, పురుషార్థ సాధనలు, కర్మమార్గం, భక్తి మార్గం, జ్ఞానమార్గాలను గురించి కూడా చక్కగా స్పష్టం చేశారు.

భగవద్గీతను సవ్యాఖ్యానంగా చదివినా తీరని సంశయాలు తీరేటట్లుగా యతీంద్ర గీతను స్వామివారు రచించి ఉన్నారనీ, శ్రీ మలయాళ యతీంద్ర గీతను భగవద్గీతకు ఒక వ్యాఖ్యానంగా భావించ వచ్చుననీ, సామాజిక రంగంలోని రుగ్మతల్ని తొలగించి సంస్కారాత్మకమయిన సత్యాలను ప్రతిబింబింప చేసే సాధనంగా ఇది ఉపయోగపడుతున్నదనీ డా॥ దశరథ దృష్టాంత పూర్వకంగా తన ఈ రచనలో సిద్ధాంతీకరించి పాఠకులకు విజ్ఞానాత్మకమైన నూతనాంశాలనెన్నిటినో వివరించి ఉన్నారు.

ఇంత చిన్నతనం లోనే ఇన్ని విషయాలను అవగతం చేసుకొని వేదాంత మార్గం వైపు తన మనస్సును మరల్చినందుకు డా॥ సముద్రాల దశరథను అభినందిస్తున్నాను. ఈ నా మిత్రుడు నా యందు నిర్హేతుకమైన ప్రేమాభిమానంతో నాకీ అవకాశాన్ని కల్గించినందుకు కృతజ్ఞతలు అర్పిస్తున్నాను. అలసట లేక అహర్నిశం శ్రమించి మరిన్ని రచనలు ఇతని కలం నుంచి వెలువడేటట్లు శ్రీనివాసుడు అనుగ్రహించుగాక!

విద్వాన్ ఇ.జి. హేమంత కుమార్

తెలుగు పండితుడు

శ్రీ వేంకటేశ్వర ఉన్నత పాఠశాల,

తిరుమల.

తిరుపతి

17-5-96

# కృతజ్ఞతాంజలి

వ్యాసాశ్రమంలో వేలకొలది బాలబాలికలు సంస్కృతంలో విద్యాభ్యాసం చేశారు. వారిలో నేనొకణ్ణి కావడం నా అదృష్టం. 1973 నుండి 1979 వరకు అక్కడ సంస్కృతోన్నత పాఠశాలలో నేను చదువుకున్నాను. తర్వాత నా ఉన్నత విద్యాభ్యాసం తిరుపతి ప్రాచ్య కళాశాలలోను, రాష్ట్రీయ విద్యాపీఠంలోను, శ్రీ వేంకటేశ్వర విశ్వవిద్యాలయంలోనూ కొనసాగింది.

ఎమ్.ఏ. పూర్తిచేసిన తర్వాత పరిశోధన కొనసాగించాలన్న ఉత్కంఠతో విషయం కొరకై అన్వేషణ కొనసాగిస్తున్నప్పుడు మా పినతండ్రి శ్రీ సముద్రాల లక్ష్మణయ్యగారు శ్రీ మలయాళ యతీంద్ర గీతను పరిశోధనాంశంగా స్వీకరించమని సూచించారు. వారు 1976లో బహుపరిశ్రమ గావించి, రచించి, ప్రకటించిన శ్రీ మలయాళ స్వామి జీవిత చరిత్ర ఆంధ్రదేశంలో అనన్య సామాన్య ప్రచారం పొందింది. వారి సూచన మేరకు శ్రీ స్వాముల వారి గీతపై పరిశోధన కొనసాగించడంలో శ్రీ వేంకటేశ్వర విశ్వవిద్యాలయం సంస్కృత విభాగం రీడరు డా॥కె. ప్రతాప్ గారు దయతో మార్గనిర్దేశకులుగా ఉండడానికి అంగీకరించారు. నాలుగు సంవత్సరాల పరిశోధన తర్వాత 1993లో నాకు వేంకటేశ్వర విశ్వవిద్యాలయం డాక్టరేట్ పట్టం ప్రసాదించింది.

ఆ పరిశోధనాంశాలనే సంగ్రహించి మరికొన్ని క్రొత్త విషయాలు చేర్చి యతీంద్ర గీతాసారమనే పేరుతో ఈ గ్రంథాన్ని రూపొందించడం జరిగింది. ఈ గ్రంథ ప్రకటనకు తిరుమల తిరుపతి దేవస్థానం వారు తగినంత ఆర్థిక సహాయమందించారు. వారికి కృతజ్ఞుడను.

ఈ గ్రంథాన్ని నా అభ్యర్థన మేరకు దయతో పరిశీలించి తమ అమూల్యమైన అభిప్రాయాలను ప్రసాదించి నన్ను కృతార్థుని కావించిన సహస్రావధాన సార్వభౌమ, అన్నమాచార్య ప్రాజెక్ట్ డైరక్టర్ డా॥ మేడసాని మోహన్‌గారికి, ఆచార్యులు డా॥కె. ప్రతాప్ గారికి, ధర్మ ప్రచార పరిషత్ కార్యదర్శి శ్రీ సముద్రాల లక్ష్మణయ్యగారికి, సుహృద్వర్యుడు ఇ.జి. హేమంత్ కుమార్ గారికి నా కృతజ్ఞాంజలి.

నన్ను సాహిత్యపరంగా ప్రోత్సహిస్తున్న గురువుగారు రాష్ట్రీయ విద్యాపీఠం వైస్ చాన్సలర్ డా॥ యస్.బి. రఘునాథాచార్యుల గారికి కృతజ్ఞతాంజలి. శుద్ధప్రతి తయారు చేయడంలో సహకరించిన సోదరి ఎమ్. సుధారాణిగారికి, మిత్రులు శ్రీ యస్.బి.యస్. భట్టాచార్య గారికి, శ్రీ కె. రాజగోపాలన్ గారికి, నన్ను అన్ని విధాలా ప్రోత్సహిస్తున్న మామగారు శ్రీ మునెయ్యగారికి నా కృతజ్ఞతాంజలి.

తిరుపతి
23/5/1996

సముద్రాల దశరథ

# విషయసూచిక

ప్రథమాధ్యాయం

# గీత - ఒక సాహితీ ప్రక్రియ

గీతా వాఙ్మయానికి అర్వాచీన సంస్కృత సాహిత్యానికి సేతువులాంటివి రామాయణ, మహాభారత, పురాణాలు. వీటిని ఐతిహాసిక సాహిత్యంగా కూడా పరిగణిస్తారు. వైదిక వాఙ్మయ చ్ఛాయలని వదిలి పెట్టకుండా నూతన సాహిత్యావిర్భావానికి పునాదులు వేసిన సంధియుగం పురాణయుగం. జాతీయ సంస్కృతిని అంతర్లీనంగా ప్రవహింపజేస్తూ దృశ్య, శ్రవ్య, మిశ్రమాది అనేక సాహితీ ప్రక్రియలకి ఊపిరిపోసిన కాలమిది.

అలా వికసించిన అనేక సాహితీ కుసుమాలలో గీతాప్రక్రియ ఒకటి. మహాభారతంలోని భీష్మపర్వంలో భగదవతార పురుషుడైన శ్రీకృష్ణుడు అర్జునునికి ఉపదేశించినట్టుగా చెప్పబడిన 'భగవద్గీత' గీతాసాహిత్యావిర్భావానికి బీజభూతమైంది. మహాభారతంలో భగవద్గీతలాంటి గీతలు పద్దెనిమిది దాకా వున్నాయి. అవి : అశ్మగీత, ఉతథ్యగీత, వామదేవగీత, ఋషభగీత, సేనజిత్‌గీత, విచక్షుగీత, మంకిగీత, బోధ్యగీత, శమ్యాకగీత, వృత్రగీత, హారీతగీత, పరాశరగీత, హంసగీత, అనుగీత, బ్రాహ్మణగీత, సజ్జగీత, ఉత్తరగీత అనునవి.

భగవద్గీతయే, గీతాసాహిత్యం అనే ఒక ప్రత్యేక సాహితీ ప్రక్రియ రూపొందడానికి ప్రధాన కారణమయింది. మహాభారతంతో పాటు మధ్యయుగ సాహిత్యానికి సంబంధించిన పురాణాల్లో దాదాపు 30 గీతలు కనపడుతున్నాయి. అవి : యమ గీత, దేవగీత, కపిలగీత, అష్టావక్రగీత, అవధూత గీత, సూర్యగీత, హంసగీత, పాండవగీత, బ్రహ్మగీత, సిద్ధగీత, పితృగీత, అగస్త్యగీత, రుద్రగీత, సూతగీత, భిక్షుగీత, ఉద్ధవగీత, బుద్ధగీత, ఋభుగీత, భ్రమరగీత, గురుగీత, శ్రుతిగీత, యజ్ఞ వరాహగీత మొదలగునవి.

పురాణచ్ఛాయలున్న యోగవాసిష్ఠాది గ్రంథాలను నిశితంగా పరిశీలిస్తే మరిన్ని గీతలు లభించే అవకాశాలున్నాయి. ప్రస్తుతం గుర్తించబడిన ప్రధానగీతలు మహాభారతంలోని లేదా పురాణాల్లోని అంతర్భాగాలు.

మహాభారత రచన విషయంలో పండితుల అభిప్రాయాలు ఎలా ఉన్నా సంగ్రహంగానో, సమగ్రంగానో ఏదో ఒక రూపంలో భగవద్గీత భారతంలోని

అంతర్భాగమనే అందరి విశ్వాసం. మధ్యయుగం నాటి సాహిత్యంలో ఆనాటి సామాజిక పరిస్థితుల వల్లనైతేనేమి, కొందరి స్వార్థబుద్ధి వల్లనైతేనేమి గ్రంథాల్లో ప్రక్షిప్త భాగాలను కూర్చడమన్నది సత్యదూరం కాదు. అయితే వాటిలో ఏవి ప్రక్షిప్తాలో, ఏవి ప్రక్షిప్తాలు కావో నిర్ణయించడం అంత సులభం కాదు. మహాభారత పురాణాల్లో లభించే గీతలన్నిటినీ ప్రక్షిప్త భాగాలనడం సమంజసం అనిపించుకోదు. అలాగే భారతంలోని భగవద్గీత మాత్రమే ప్రక్షిప్తమనడం కూడా అంతే అసమంజసమౌతుంది. కొన్ని గీతలు భారత పురాణాల్లోని ఇతివృత్తాలతో విడదీయరానంతటి ప్రగాఢ సంబంధాల్ని కలిగి వున్నాయి. ఈ గీతలు వాటి మూల గ్రంథాలలోని సామాజిక, వైయక్తిక, ఆధ్యాత్మిక విజ్ఞానానికి ప్రతీకలుగా కనపడతాయి.

'గీతా' అనేది ఒక సాహితీ ప్రక్రియా నామం. ఇది సామాన్యమైన శబ్దార్థంకంటే భిన్నమైనది కాకపోయినా ఒక ప్రక్రియని నామనిర్దేశం చేయడానికి ఉపయోగింపబడిన శబ్దంగా గుర్తించవచ్చు. ఉదాహరణకి వైదిక సాహిత్యంలోని ఋక్కులకు 'పఠించడం' లేదా 'పాడటం' అనే అర్థం ఆ శబ్దం ద్వారానే తెలియబడినా, తర్వాతి కాలంలో పాడటానికి అనువైన కొన్ని ఋక్కులు వైదిక సాహిత్యం నుంచి వేరుబడి ఒక ప్రత్యేకమైన వేదభాగంగా, 'సామవేదం' అన్న పేరుతో గుర్తింపబడటాన్ని మనం గుర్తించవచ్చు. అంటే ఋక్కులన్నీ గానయోగ్యాలే అయినా, వాటిలో కొన్ని కేవలం ఒకసారి లేదా రెండుసార్లు పఠించడానికి మాత్రమే పరిమితం కాక, విశేషమైన సందర్భాల్లో శృతిలయలతో నియమబద్ధంగా, తప్పనిసరిగా, మరీ మరీ పఠించదగినవిగా గుర్తించబడటాన్ని గమనించవచ్చు. ఇదొక సంప్రదాయంగా మారటాన్ని పురాణాల్లో మనం చూస్తాం.

ప్రతి పురాణము ఒక అరణ్యంలో లేదా ఒక ఆశ్రమంలో, సత్రాది విశేష సందర్భాల్లో గుమికూడిన ఋషిగణాన్ని లేదా శిష్య సమూహాన్ని ఉద్దేశించి జ్ఞాన సిద్ధుడయిన ఒక ముని లేదా గురువు ఉపదేశించినట్టుగానే ఆరంభమౌతుంది. నిజానికి ఆ పురాణాలు ఎలా రూపుదాల్చాయో తెలియదు కాని, ఆ పురాణ కర్తలు ప్రసిద్ధ పురుషుల ద్వారా ఒకానొక సందర్భంలో సనాతన వైదిక ధర్మాన్ని, మానవ జీవన గమ్యాన్ని, ఆ గమ్యానికి చేర్చే మార్గాలని గురించి తమ కృతుల ద్వారా

బోధింపచేయడమనేది ఒక లక్షణమయింది. ఒకే ధర్మం దేశ కాలాదులకు అనుగుణంగా భిన్న స్వరూపాల్లో ఆవిర్భవించడం మనం గుర్తించవచ్చు. అధిపూర్వక ''ఇణ్'', ''పఠ్'' అనే ధాతువుల నుండి నిష్పన్నమైన 'అధ్యయన', 'పఠన' శబ్దాలకు చదవడం లేదా తెలుసుకోవడం అని అర్థం. కాని 'గై' ధాతురూపమయిన గీతా శబ్దం పై శబ్దాల్లో లేని ఒక విశేషార్థాన్ని కలిగి పునః పునః పాడుకోవడానికనుకూలమైన ఒక ప్రక్రియను తెలియజేస్తూ వుంది. ఒక సంక్షిప్తమైన తాత్త్విక భావాన్ని సులభంగా జ్ఞాపకం చేసుకోవడానికి అనుకూలంగా రూపొందించినవి గీతలని భావించవచ్చు. అందుకే 'గీతం గానమిమే సమే' అని అమరకోశం పేర్కొంటుంది. మహాభారతం, పురాణాల్లో 'గీతా' శబ్దం 'గీయంతే స్మ ఇతి గీతా' స్త్రీలింగ వాచకంగా సూచింపబడితే భాగవత పురాణంలో 'గీతం' 'గీయతే ఇతి గీతం' అనే నపుంసక రూపంలో ప్రయోగించబడింది. మహాభారతంలోని గీతలు మత, ధార్మిక, తాత్త్విక విషయాలను సంవాదాత్మక రూపంలో బోధించడానికి ఉద్దేశించబడితే, భాగవతంలోని గీతాలు సందర్భానుసారంగా ఉపన్యాసధోరణిలోనో లేదా స్తుతిరూపాలుగానో సాగుతాయి. విషయ స్వరూపాలని బట్టి 'గీతం', 'గీతా' రెండూ భిన్నప్రక్రియలని, వీటికి భిన్న ప్రయోజనాలు కూడా ఉన్నాయని డా. రత్నం నీలకంఠం ఉద్దేశ్యం.

భగవద్గీతలో అవతారపురుషుడైన శ్రీకృష్ణుడు తాను పరబ్రహ్మ స్వరూపమని, తానే శరణ్యుడనని ఉపదేశించడం చేత, మతంలోని ఒక సంప్రదాయానికి సంబంధించిన దేవతామూర్తిని సూచించడంచేత, గీత కేవలం ఒక సంప్రదాయానికి మాత్రమే పరిమితమైనదిగా కనపడుతుంది. కాని అది యథార్థంకాదు. ఎందుకంటే వైష్ణవులు భగవద్గీత భాగవత సంప్రదాయానికి చెందినదని, వైష్ణవతత్త్వ ప్రబోధకమని వాదించినా, అందులో సహజమైన నిర్ద్వంద్వమైన అద్వైత భావనలున్నట్లు శంకరాచార్యాదుల వ్యాఖ్యానాల వల్ల స్పష్టము అవుతుంది. అలా అని తర్వాత వచ్చిన గీతలన్నీ ఇటువంటి కోవకే చెందినవని చెప్పడానికి వీలుకాదు. ఉదాహరణకు :- దేవీగీతలో దేవియే పరమోత్కృష్ట దైవమని, దేవి ఉపాసనే శరణ్యమని చెప్పబడింది. అలాగే శివగీత, గణేశగీత, రామ గీతాదులు శివ, గణేశ, రామాదులు పరమ శ్రేష్ఠులని, వారు పరబ్రహ్మరూపాలే అని ప్రతిపాదిస్తాయి.

ఉపనిషత్తుల్లో బ్రహ్మమే విశ్వానికి మూలాధారం అనే సిద్ధాంతం రూపుదాల్చడానికి ముందు ఎన్ని దశల్ని దాటిందో, గీతా సాహిత్యంలో కూడా ఆ భావనావికాసం అన్ని దశల్ని దాటింది. ఉదాహరణకు :- వైదిక కాలంలో ఇంద్రవరుణాది అనేక దేవతామూర్తుల ఆరాధనలతో ఆరంభమై, ఉపనిషత్తుల్లో బ్రహ్మమొక్కటే ఉపాస్యమని నిర్ణయించబడినట్టుగానే, గీతలు కూడా ఆరంభంలో వివిధ దేవతా మూర్తుల ఉపాసనను ప్రతిపాదించి, చివరికి ఆ ఉపాసనా మూర్తులన్నీ పరబ్రహ్మ స్వరూపాలేనని ప్రతిపాదిస్తాయి. అలాగే విశ్వం యొక్క సృష్టి స్థితి ప్రళయాలకు కారకమైనది బ్రహ్మమే అని ఉపనిషత్తులు ఘోషిస్తే, గీతలు కూడా ఆ విషయాన్నే సమర్థిస్తాయి. ఉపనిషత్తులు బ్రహ్మ పదార్థసాధనకి యుక్తి యుక్తమయిన, తార్కికమయిన అనుమాన ప్రమాణాన్ని ఆశ్రయిస్తే, గీతాసాహిత్యం ఇంద్రియ గోచరమైన ప్రత్యక్ష ప్రమాణాన్ని స్వీకరించనందువల్ల విభూతియోగాలు, విశ్వరూప సందర్శన యోగాలు గీతల్లో చోటు చేసుకున్నాయి. దీనికి ఆయా కాలాలకు సంబంధించిన అధికారులలోని తారతమ్య భేదాన్ని కారణంగా పరిగణించవచ్చు. ఉపనిషత్తులు బ్రహ్మైక్యప్రాప్తికి యోగాది సాధనలను, భౌతిక, ఆధ్యాత్మిక నియమాలను మార్గాలుగా ప్రతిపాదిస్తే, గీతా సాహిత్యం ఆయా దేవతామూర్తులకు సంబంధించిన అర్చన, ఆరాధన, పూజ, జప విధానాలను మార్గాలుగా నిర్ణయిస్తుంది. ఈ విధంగా ఏదో ఒక సంప్రదాయానికి చెందిన దేవతా మూర్త్యుపాసనతో ఆరంభమై 'ఏకమేవ అద్వితీయం' అని ఉపనిషత్తులు ఘోషించే బ్రహ్మపదార్థ ప్రతిపాదనతో అంతమౌతుంది గీతాసాహిత్యం.

మనకు లభించే గీతలను సూక్ష్మంగా పరిశీలించి రెండు వర్గాలుగా విభజించవచ్చు.

1. **Sectarian** మతంలో ఒక సంప్రదాయానికి మాత్రమే పరిమితమైనవి.

2. **Non-Sectarian** సంప్రదాయాలకతీతంగా తాత్త్విక, ఆధ్యాత్మిక విషయాలని ప్రతిపాదించేవి.

రామగీత, గణేశ గీత, శివగీత ఇత్యాదులు మొదటి వర్గానికి చెందినవి. ఉతథ్యగీత, వామదేవగీత, ఋషభగీత, శమ్యాకగీత, హంసగీత, అనుగీత

రెండవవర్గానికి చెందినవి. పరమ పురుషార్థ సాధనకి ఆయా దేవతామూర్తుల చేతనే బోధింపబడినవిగా పేర్కొనబడేవి మొదటివర్గానికి సంబంధించిన గీతలు. రెండవ వర్గానికి చెందిన గీతల్లో ఉపనిష్త్రతిపాదితాలైన తత్త్వాలని మూలవిషయంగా స్వీకరించినా, వాటిని బోధించడానికి లేదా దార్శనిక తత్త్వానికి సంబంధించిన ప్రశ్నలకు సమాధానాలుగా రూపొందినవి. క్షత్రియ ధర్మాలని తెలియజేసే ఉతథ్యుని సమాధానం ఉతథ్యగీత, ఒక సమస్యకి వామదేవుని పరిష్కారం వామదేవగీత. అదే విధంగానే ప్రజాపతి హంసరూపంలో బోధించిన గీత హంసగీత, ఒక బ్రాహ్మణుని రూపంలో శ్రీకృష్ణుడు బోధించిన గీత బ్రాహ్మణగీత, గీతా సాహిత్యానికి ఆరంభకారకమైన భగవద్గీత ఈ రెండు వర్గాల లక్షణాలని కలిగి వుండడం విశేషం.

ఇటువంటి లక్షణాలతో కూడిన గీతలు ఎవరికి ఉద్దేశించినట్లు? శాస్త్రాల, దర్శనాల అవగాహనకి ఒక రకమైన బౌద్ధిక శిక్షణ అవసరం. అటువంటి శిక్షణ అందరికీ అందుబాటులో లేదు. అందుకే సనాతన ధర్మావిష్కారానికి కథా, ఆఖ్యాయికా రూపాల్లో మహాభారత, రామాయణాదులు వెలిశాయి. బ్రహ్మజ్ఞాన ప్రాప్తికి, అకుంఠితమైన దీక్ష, అన్వేషణ, ఏకాగ్రత అవసరం. అటువంటి సామగ్రి లేదా శిక్షణ తగినంతగా లేని సామాన్య మానవునికి తరణోపాయంగా, అనాయాసంగా పాడుకోవటాని కనుకూలమైనదిగా రూపొందించబడింది గీతాప్రక్రియ. వీటిలో సామాన్యునికి సామాన్యార్థము, అసామాన్యునికి అసామాన్యార్థం స్ఫురించడమన్నది మరో గొప్ప లక్షణం. ఈ విధంగా జిజ్ఞాస కలిగిన వారందరికీ ఉద్దేశించబడింది 'గీత'.

మరోవిధంగా చూసినట్టయితే గీతాసాహిత్యాన్ని, మహాభారతంలోని గీతలని, పురాణాల్లోని గీతలని రెండు విధాలుగా విభజించవచ్చు. భారతంలో భగవద్గీత తప్ప మిగిలిన గీతలు ఒకే సంప్రదాయానికి లేదా ఒకే దేవతామూర్తికి సంబంధించినట్టుగా అగుపడవు. నైతికము, ఆధ్యాత్మికమయిన బోధనలని ఒక ప్రసిద్ధ పురుషుని ద్వారా వెలువరించడం అనేది మాత్రమే కనపడుతుంది. అంతే కాకుండా అనేక గీతలు శాంతి పర్వంలోను, అందులో ఉపపర్వమైన మోక్ష ధర్మపర్వంలోనూ కనపడతాయి

పురాణాల్లోని చాలా గీతలు ఏదో ఒక సంప్రదాయానికి చెందినవిగా ఉండి, ఆయా దేవతా లేదా దేవీ ఉపాసనలని ప్రతిపాదిస్తాయి. వీటిలో బహుకొద్ది గీతలు మాత్రమే ( యోగవాసిష్ఠంలోని బ్రహ్మగీత, అగ్నిపురాణంలోని యమగీత) మహాభారతంలోని గీతల్లాగా బ్రహ్మవిద్యను సూచించినా, అవి చాలావరకు ఏదోఒక దేవతా సంప్రదాయానికి పరిమితమైనాయి.

గీతా స్వరూపాన్ని స్థూలంగా గమనిస్తే ఒకే సాంప్రదాయానికి చెందినా, సంప్రదాయాతీత వర్గానికి చెందినా గీతలు సంవాద రూపాలు. గీతా సాహిత్యానికి ఆకరాలైన మహాభారత, పురాణాలు కూడా సంవాదాత్మకాలు కావడం గమనార్హం. స్మృతి సాహిత్యం తర్వాత ఒక్క రామాయణం తప్ప మిగిలిన సాహిత్యం తంత్రాల వరకు సంవాదాత్మకంగానే సాగింది. ఒక ప్రశ్న, దానికి సమాధానం లేదా ఒక సమస్య దానికి పరిష్కారం ఇది గీత యొక్క సామాన్య లక్షణం.

అలాగే ఈ గీతా ప్రయోజనం ఏమిటంటే, ఒక తాత్త్విక సిద్ధాంతాన్ని , ఒక సాధన మార్గాన్ని, సూత్రప్రాయంగా, సూక్ష్మంగా. సులభంగా, అవగాహన కలిగించడం. వీటిని ఒక రకమైన ప్రకరణ గ్రంథాలని కూడా పిలవవచ్చు. అంతేకాకుండా వివిధ సిద్ధాంతాలని, వివిధ సాధనా మార్గాలని పరిచయం చేస్తూ, తమదంటూ ఒక స్వంత సిద్ధాంతాన్నో లేదా మార్గాన్నో ప్రతిపాదించడం కూడా మరొక లక్షణం. ఉదాహరణకు :- భగవద్గీత భక్తి, కర్మ, జ్ఞాన యోగాలని పరిచయం చేస్తూనే, వాటన్నిటినీ సమన్వయం చేస్తూ, తనదే అయిన జ్ఞాన కర్మ సముచ్చయ వాదాన్ని ప్రతిపాదిస్తుంది. అలాగే దేవీగీత కూడా సృష్టికి కారణం తపస్సు, తమస్సు, చైతన్యం, నిశ్చైతన్యం అని ఇతరుల సిద్ధాంతాలని పేర్కొని, వివిధ నామాలతో వ్యవహరించబడే ప్రకృతే కారణమని తన సిద్ధాంతాన్ని సూచిస్తుంది. ఈ గీతలు ప్రత్యక్షంగా గాని, పరోక్షంగాగాని విషయాలని విషయ ప్రతిపాదకాలైన శబ్దాలని ఉపనిషత్తుల్లో నుంచి యథాతథంగా అరువు తెచ్చుకున్నట్టుగా కనపడతాయి.

గీతా సుగీతా కర్తవ్యా కిమన్యైః శాస్త్ర విస్తరైః ।
యా స్వయం పద్మనాభస్య ముఖపద్మాద్వినిస్సృతా ॥

మహాభారతానికి వ్యాఖ్యానం వ్రాసిన శ్రీధరస్వామి భగవద్గీత ప్రాశస్త్యాన్ని పేర్కొంటూ గీత ఒక శాస్త్రము. దీనిని చక్కగా అధ్యయనం చేసినట్టయితే ఇతర శాస్త్రాలతో పనిలేదు. ఇది సాక్షాత్తు శ్రీకృష్ణ పరమాత్మ యొక్క ముఖ పద్మంనుండి వెలువడిందని అంటాడు.

మహాభారతం భీష్మపర్వంలోని 40వ అధ్యాయం చివర్లో 'భగవద్గీత' అని మాత్రమే చెప్పడం జరిగింది. అయితే భగవద్గీత ఒక విశేష సాహితీ ప్రక్రియగా స్థిరపడి, ప్రసిద్ధిని పొందిన తరువాత, భగవద్గీతను ఉపనిషత్తని, బ్రహ్మవిద్య అని, యోగశాస్త్రమని పేర్కొన్నట్లు 18 అధ్యాయాల చివర్లోని వాక్యాల ద్వారా తెలుస్తోంది. గీత ఉపనిషత్సారము కావున 'ఉపనిషత్తు' అని, బ్రహ్మవిద్యను బోధిస్తున్నది కావున బ్రహ్మవిద్య అని, ఇందు కర్మ, భక్తి, ధ్యాన, జ్ఞానాది యోగరహస్యాలు పేర్కొనబడినాయి కనుక యోగశాస్త్రమని చెప్పబడింది. శ్రీకృష్ణార్జునులు ధర్మక్షేత్రమైన కురుక్షేత్రంలో, పరస్పరం సలుపుకొన్న సంవాదము కాబట్టి శ్రీకృష్ణార్జున సంవాదమని కూడా వ్యవహరింపబడింది.

భారతీయ వేదాంత వాఙ్మయంలో ఉపనిషత్తులు, బ్రహ్మసూత్రాలు, భగవద్గీత ఈ మూడింటికి ప్రస్థాన త్రయమని పేరు. ద్వైతాద్వైత, విశిష్టాద్వైత మత సంస్థాపకాచార్యులైన మధ్వ, శంకర, రామానుజాచార్యులు ఈ ప్రస్థాన త్రయాలను వ్యాఖ్యానిస్తూ, తమ తమ సిద్ధాంతాలే వాటియందు ప్రతిపాదించబడినట్టుగా వ్యాఖ్యానించారు. అందువల్ల ఒక నూతన మతాన్ని స్థాపించాలనుకున్నవాడు తన సిద్ధాంతం ప్రస్థాన త్రయాల్లో ప్రతిపాదితమయినట్టుగా వ్యాఖ్యానించడం ఒక సంప్రదాయమయింది.

భగవద్గీత సరళమయిన, లౌకికమయిన సంస్కృత భాషలో రచింపబడింది. కావున ప్రస్థాన త్రయాల్లో భగవద్గీత అత్యధిక సంఖ్యాకులైన జనులకు ఉపాదేయమయింది. భగవద్గీత స్వతంత్ర గ్రంథము కాదు. అది మహాభారతంలో ఒక భాగం మాత్రమే. అయినా ఏ స్వతంత్ర గ్రంథానికీ లేని అనన్య సామాన్య ప్రచారం ఈ గ్రంథానికి లభించింది. అవతార పురుషులకు జరిగినట్లు గీతలకు కూడా జయంతులు జరగడమన్నది గీతా ప్రాశస్త్యానికి నిదర్శనం.

ఒక గ్రంథం యొక్క ప్రాశస్త్యం గ్రంథంలో చెప్పే విషయాన్ని బట్టి ఆ విషయాన్ని చెప్పే వక్తను బట్టి, దాన్ని ఒక గ్రంథంగా తీర్చే రచయితను బట్టి ఉంటుంది. విద్యల్లోకెల్ల మేటిదయిన ఆధ్యాత్మిక విద్య లేక బ్రహ్మవిద్య గీతకు విషయము. 'ఆధ్యాత్మ విద్యా విద్యానాం' అని శ్రీకృష్ణుడే గీతలో పేర్కొన్నాడు. అందువల్ల ఇందలి విషయము అత్యంత ముఖ్యమైనది. సాక్షాత్తు భగవంతుడే దీనివక్త. దీన్ని గ్రంథస్థం చేసినవాడు భగవత్స్వరూపుడైన వ్యాసుడు. ''మునీనామప్యహం వ్యాసః'' అని కృష్ణుడు పేర్కొంటాడు. అందుకే గీతకు సాటిలేని మేటి ప్రచారం లభించింది.

ఈ భగవద్గీత అర్జున విషాద యోగంతో ప్రారంభమై, మోక్ష సన్న్యాస యోగంతో ముగుస్తుంది. ఇందులో మొత్తం 700 శ్లోకాలున్నాయి. కొన్ని ప్రతుల్లో ఒక శ్లోకం ఎక్కువగా కనపడుతుంది. సంసార మూలమైన అవిద్యను తొలగించి, మోక్షహేతువైన బ్రహ్మజ్ఞానాన్ని కలిగించేది గీతాశాస్త్రం. కురుక్షేత్రంలో యుద్ధం చేయగోరి వచ్చి, ధనుర్బాణాలు విసర్జించి రథంపై కూలబడిన పార్థుని విషాదాన్ని, భ్రాంతిని, అజ్ఞానాన్ని పోగొట్టడానికి ఉద్దేశించబడినా, ఈ గీతా ప్రబోధం తరువాత సకల మానవాళికి వెలుగుబాటని ప్రసాదించింది.

గీతలో 18 అధ్యాయాలను షట్కత్రయంగా కూడా వ్యవహరించటం కద్దు. ప్రథమ షట్కాన్ని కర్మకాండమని, ద్వితీయషట్కాన్ని ఉపాసనా కాండమని, తృతీయం షట్కాన్ని జ్ఞానకాండమని వ్యవహరించవచ్చు. వేదాల్లో ప్రతిపాదించినట్లుగానే భగవద్గీతలో కూడ ఈ మూడు కాండలు బోధింపబడినాయి గనుక శంకరాచార్యులు ''తదిదం గీతాశాస్త్రం సమస్త వేదార్థసార సంగ్రహభూతమ్'' అని అన్నారు. మహావాక్యాల్లో ''తత్త్వమసి'' అనేది ఒక ఉపదేశ వాక్యం. గీతలోని ప్రథమ షట్కము తత్పదార్థమయిన బ్రహ్మని, ద్వితీయ షట్కము యుష్మత్ పదార్థమయిన జీవుని, తృతీయ షట్కము 'అసి' పదార్థమయిన వాటి రెంటి ఐక్యాన్ని బోధిస్తాయని దర్శనకారులు, ఉపనిషత్ వ్యాఖ్యాతలు నిరూపించారు.

లోకంలో అనేక మతాలున్నాయి. మతగ్రంథాలు లెక్కలేని సంఖ్యలో వున్నాయి. అయితే సర్వమతసారము భగవద్గీతలో ఉందని మహర్షి - సద్గురు -

శ్రీమలయాళ స్వాములవారి అభిప్రాయం.

సంసార సాగరం ఘోరం తర్తుమిచ్ఛతి యో నరః ।
గీతానావం సమాసాద్య పారం యాతి సుఖేన సః ॥

సంసారము సముద్రం వంటిది. ఆ సాగరాన్ని దాటగోరిన వాడు గీతయనే పడవని అధిరోహించాలి. చిన్న అద్దంలో కొండను ప్రతిఫలింపచేసినట్టు 700 శ్లోకాల్లో సకల వేదాంత సారాన్ని ఇముడ్చుకున్న భగవద్గీత త్రికాలాబాధ్యము, విశ్వజనీనము, అందుకే భగవద్గీత ప్రపంచ వాఙ్మయంలో నాటికీ, నేటికీ, ఏనాటికీ అద్వితీయమే.

## స్వతంత్ర గీతలు

భగవద్గీత నాధారం చేసుకొని ఎన్నో స్వతంత్ర గీతలు వెలువడినాయి. సామాజిక స్పృహ, మానవతా దృక్పథాన్ని జోడించిన ఆధునిక తాత్త్విక భావనలు వీటిలో చోటు చేసుకున్నాయి. అటువంటి గీతల్లో చెప్పుకోదగినవి కొన్ని.

### శ్రీశక్తిగీత :

మొట్టమొదట 1919వ సంవత్సరములో కాశీలోని శ్రీ భారత ధర్మ మహామండలి ద్వారా హిందీ భాషానువాద సహితంగా సంస్కృతంలో ముద్రించబడింది. దేవాసుర సంగ్రామం తరువాత కృతయుగారంభంలో జరిగిన అనుమాన తత్త్వవిషయ విచారణ ఇందలి ఇతివృత్తం. ఇందులో 7 అధ్యాయాలున్నాయి. దీనిని శ్రీ శ్రీ శ్రీ లక్ష్మీకాంతానంద యోగివర్యులు 1967న తెలుగులో కనువదించారు.

### యతిగీత :

స్వామి వివేకానందులు ఇంగ్లీషులో "A song of the Sannyasin" అను పేరున యతి ధర్మాన్ని ప్రబోధిస్తూ ఈ గీతను రచించారు. ఇందులో 13 శ్లోకాలున్నాయి. తాను యతిగా వుంటూ స్వయంగా రచించారు. ఇది యతిధర్మ

బోధకం కనుక దీనికి 'యతి గీత' అని పేరు పెట్టడం జరిగింది. దీన్ని తెలుగులోకి శ్రీ ఆదిపూడి సోమనాథరావుగారు అనువదించారు.

**అష్టావక్రగీత :**

జనకమహారాజు, అష్టావక్ర మహర్షుల నడుమ జరిగిన సంవాద రూపకము అష్టావక్రగీత. ఇందులో 20 అధ్యాయాలున్నాయి. మొత్తం శ్లోక సంఖ్య 285. ఇందులోని శ్లోకాలు యోగ వాసిష్ఠంలోని రచనాశైలి పోకడను స్మరణకు తెస్తాయి. జ్ఞానయోగం ఇందులో ప్రధానంగా స్వీకరించబడింది. మొట్టమొదట ఎవరు గ్రంథరూపము చేశారో తెలియదు గాని, దీని తెలుగు వ్యాఖ్యాత చుక్కా అప్పలస్వామి.

**రమణగీత :**

శ్రీరమణ మహర్షి అప్పుడప్పుడు శిష్యులనుద్దేశించి ప్రసంగించిన ఉపన్యాసాల సారాంశం శ్రీ వాసిష్ఠ గణపతి మునీంద్రులచే 'శ్రీరమణగీత' పేరుతో గ్రంథస్థం చేయబడింది. ఇందులో 18 అధ్యాయాలున్నాయి. ముఖ్యంగా భక్తి, జ్ఞాన, శక్తి, శ్రవణ, మనన, నిదిధ్యాసనాదులు ఇందులో వివరంగా చెప్పబడినాయి.

**శ్రీజగద్గురు రేణుక గీత :**

శ్రీ శివయోగి శివాచార్యులచే రచింపబడిన 'సిద్ధాంత శిఖామణి' అనే గ్రంథాన్ని ఆధారం చేసుకొని యమ్. శివకుమారస్వామి సంగ్రహంగా కూర్చినది శ్రీ జగద్గురు రేణుక గీత. ఇందులో 14 అధ్యాయాలు ఉన్నాయి. ఇది వీరశైవ మతంలోని షట్స్థల, ఏకోత్తర శతస్థలాలను గురించి పరిచయం చేసే గ్రంథం.

**శ్రీసత్యసాయి గీత :**

శ్రీసత్యసాయి బాబాగారి ఆధ్యాత్మిక ప్రసంగాలకు శ్రీకూచి వీరభద్రశర్మచే శ్లోకరూపం దాల్చినది శ్రీసత్యసాయిగీత. ఇందులోని 635 శ్లోకాలు 18 అధ్యాయాలుగా విభజింపబడినాయి.

# శ్రీమలయాళ యతీంద్రగీత ఆవిర్భావం

ఆధునిక కాలంలో కొందరు మహాత్ములు తమ సిద్ధాంతాలను, ఉపదేశాలను, అభిప్రాయాలను గీత అనే పేరుతో ప్రకటించారు. 'గీత' అను నామానికి గల గౌరవాతిశయాన్ని బట్టి గ్రంథ గౌరవం సంపాదించటానికి ఈ వ్యవహార నామాన్ని రచయితలు ప్రచారంలోకి తెచ్చినారని భావించవచ్చు. దీనిని బట్టి ఆయా కాలాలలో, ఆయా మహనీయుల ప్రబోధాలు వారి వారి పేర గీతలుగా రచింపబడటం సంప్రదాయమయింది. యతిగీత, శ్రీరమణ గీత, శ్రీసత్యసాయిగీత మొదలైనవి ఆధునిక కాలంలో వెలువడిన గీతలు.

శ్రీ మలయాళ స్వాములవారి ఆశయాలు చాలా వరకు ఆంధ్రదేశంలో బాగా ప్రచారమైన తరువాత కొందరు బ్రహ్మనిష్ఠులకు, సాధువులకు, పండితులకు, మహిళామణులకు శ్రీస్వాములవారి సదాశయాలని ఒక గ్రంథంగా రూపొందిస్తే బాగుంటుందన్న సంకల్పం కలిగి వారు స్వామిని ప్రార్థించగా, స్వామి వారి కోరికను మన్నించి 'శ్రీమలయాళ యతీంద్రగీత' అను పేర ఒక గ్రంథ నిర్మాణాని కంగీకరించారు.

శిష్యులు అడిగిన ప్రశ్నలకు సమాధానాలు సిద్ధంచేసి, కొన్ని అభిప్రాయాలకు తానే స్వయంగా స్వామీజీ సంస్కృత శ్లోకాలను రచించారు. మరికొంత భాగాన్ని మొదట గద్యంగా వ్రాయించి, సంస్కృత భాషలో ఛందోబద్ధం గావించడానికి మాధవ చైతన్య బ్రహ్మచారి, కృష్ణచరణం, శివచరణం అనే ముగ్గురు శిష్యులకు అప్పగించారు. వారు స్వామి ఆదేశాన్ని శిరసావహించి గ్రంథాన్ని ఛందోబద్ధం గావించారు.

శ్రీమాధవ చైతన్య బ్రహ్మచారి బాల్యంలో శ్రీవ్యాసాశ్రమంలోనే విద్యనభ్యసించి, ఇపుడు సన్న్యాసాశ్రమాన్ని స్వీకరించి కాశిలో వున్నారు. సంస్కృతంలో అనేక గ్రంథాలు వ్రాశారు. వీరికి సంస్కృత భాషలోనూ, శాస్త్రపాండిత్యంలోనూ లోతైన పరిజ్ఞానం ఉంది. వీరు సంస్కృత భాషా ప్రచారంలో కూడా సిద్ధహస్తులు. శ్రీమలయాళ యతీంద్రగీతలో వున్న 3, 4 6, 13, 14, 15 అధ్యాయాలను ఛందోబద్ధం కావించింది వీరే.

శ్రీ కృష్ణచరణం గారు 'శ్రీ మలయాళ సద్గురు సుప్రభాతం' మొదలైన గ్రంథాలను రచించారు. వీరు కూడా బాల్యంలో ఆశ్రమంలోనే గురుకుల వాసమొనర్చి సంస్కృతము అభ్యసించారు. అపారమైన గురుభక్తి కలవారు. శ్రీ మలయాళ స్వామి తరువాత శ్రీ విమలానంద స్వామి పేరుతో 1962 నుండి పీఠాధిపతులుగా ఉండి 1973లో బ్రహ్మ సాన్నిధ్యాన్ని పొందారు. ఈ గ్రంథంలో వీరు 1, 2, 8, 9, 10, 12, 18 అధ్యాయాలను ఛందోబద్ధం గావించారు.

శ్రీ శివచరణం గారు కూడా బాల్యంనుంచి ఆశ్రమంలోనే విద్యనభ్యసించి, తర్వాత తిరుపతి ఓరియంటల్ కళాశాలలో సాహిత్య శిరోమణిలో ఉత్తీర్ణులై, ఆశ్రమంలోని బ్రహ్మవిద్యా పాఠశాలలో పనిచేశారు.

వీరు వేదాంత వాఙ్మయంలో ఎక్కువగా కృషి చేశారు. ప్రస్తుతం వీరు నిర్విశేష శివానందస్వామి అనుపేరుతో సన్న్యాస దీక్షస్వీకరించి, ఖమ్మం పట్టణంలో 'బ్రహ్మనిష్ఠాశ్రమం' అను పేర ఒక ఆశ్రమం నిర్మించుకొని ఉన్నారు. వీరు 'శంకరవిజయం', 'వివేక చూడామణి', నృసింహోత్తర తాపిన్యుపనిషత్తు మొదలైన గ్రంథాలకు తెలుగులో విపుల వ్యాఖ్యానాలు రచించారు. 'సనాతన బ్రహ్మజ్ఞాన మహాసభ' అను సంస్థను కూడా స్థాపించారు. ఈ గ్రంథంలో వీరు 5, 7, 11, 16, 17 అధ్యాయాలను ఛందోబద్ధం గావించారు.

భగవద్గీతలో వలె శ్రీ మలయాళ యతీంద్రగీతలో కూడా18 అధ్యాయాలు ఉన్నాయి.

| | అధ్యాయం పేరు | శ్లోక సంఖ్య |
|---|---|---|
| 1. | జ్ఞాన యోగము | 82 |
| 2. | యోగవిజ్ఞాన యోగము | 50 |
| 3. | బ్రహ్మచర్య ప్రభావయోగము | 46 |
| 4. | విద్యాయోగము | 48 |
| 5. | స్త్రీ విద్యాధికారయోగము | 60 |
| 6. | జాతి నిర్ణయ యోగము | 91 |

ఈ విధంగా నిర్మింపబడిన శ్రీమలయాళ యతీంద్రగీతను తెలుగు అనువాదం తో పాటు 1954లో గ్రంథరూపంగా శ్రీవ్యాసాశ్రమం వారు ప్రకటించారు.

**దయగల హృదయమే భగవన్నిలయము**

**సూర్యుడు పట్టణము, పల్లె అను భేదము లేక అంతటను తన దివ్య తేజమును ప్రసరింపజేసి లోకమును పావనమొనర్చును గదా ! అట్లే జ్ఞానులు దైవజ్ఞానమును లోకమంతట వ్యాపింపజేసి జీవులనెల్ల తమస్సు నుండి ఉద్ధరించి ఆత్మజ్ఞాన ప్రకాశములోనికి దెచ్చి జీవన్ముక్తులుగా జేయుదురు.**

శ్రీ మలయాళ స్వామి

## ద్వితీయాధ్యాయం

# భగవద్గీత - యతీంద్రగీత పూర్వరంగం

గీతా సాహిత్యమనే ప్రక్రియకు ఒరవడి పెట్టింది భగవద్గీత. కృష్ణార్జున సంవాద రూపంలో సాగిన ఈ గ్రంథంలో బ్రహ్మతత్త్వమే ప్రతిపాద్యం కావడం వల్ల ఇది బ్రహ్మవిద్య అని పిలువబడింది. ఆత్యంతిక దుఃఖశాంతి, నిరతిశయానంద ప్రాప్తి అనేవి బ్రహ్మనిష్ఠులకందరికీ ముఖ్య ప్రయోజనాలు. గీతను బోధించిన క్షేత్రం రణరంగమే కావచ్చు. బోధన విన్నవాడు పాండవుల్లో ఒకడైన అర్జునుడే కావచ్చు. అయినా కురుక్షేత్రంలోని పోరాటం జీవులందరి హృదయక్షేత్రంలోని పోరాటానికి ప్రతీక. దైవప్రవృత్తికీ, అసుర ప్రవృత్తికీ సృష్ట్యాదినుండి పోరాటం సాగుతూనే ఉంది. ఇక్కడ పాండవులు దైవప్రవృత్తికీ, కౌరవులు ఆసురప్రవృత్తికీ సంకేత భూతులు. కురుక్షేత్రం హృదయక్షేత్రానికి సంకేతం.

భగవద్గీతను మొదటిసారి విన్న అర్జునునికి ఉన్న పది పేర్లలో నరుడనే పేరు ఒకటి. మానవులందరూ నరులే. అందువల్ల నరుణ్ణి ఉద్దేశించి బోధించబడిన గీత మొత్తం నరజాతినుద్దేశించి బోధించిన గీత అనడంలో ఏ మాత్రం సందేహం లేదు. పార్థునికి మోహం, శోకం అనే రెండు దుర్లక్షణాలు కలిగాయి. 'వీరందరూ నావారు' అనేది మోహం, 'అయ్యో వీరిని చంపవలసి వచ్చిందే' అనేది శోకం. ఈ మోహ శోకాలు పార్థునికి మాత్రమే పరిమితాలు కావు. సంసార యాత్ర సాగించే ప్రతి జీవుడూ శోక, మోహాలకు గురి అవుతూనే ఉన్నాడు. అహంకార మమకారాలు ఉన్నంతవరకు శోకమోహాలు తప్పవు. శాశ్వత సుఖశాంతులు కలగవు. ఈ దుస్థితి నుండి జీవుడు బయట పడాలంటే అతనికి 'ఆత్మానాత్మ వివేకం' కలగాలి. గీతలో కృష్ణుడు రెండవ అధ్యాయంలో ఆత్మానాత్మ వివేకాన్ని ప్రధానంగా బోధించాడు. వివేక సంపన్నుడైన స్థితప్రజ్ఞుని లక్షణాలను అధ్యాయాంతంలో వివరించాడు. 'ఏషా బ్రాహ్మీ స్థితిః పార్థ' అని స్థితప్రజ్ఞ స్థితిని బ్రాహ్మీస్థితిగా అభివర్ణించాడు. తరువాత ఆ స్థితిని సాధించడానికీ, అందులో నిలకడ కలగడానికీ అవసరమైన నిష్కామ కర్మయోగాన్ని తృతీయాధ్యాయం నుండి చివరివరకు అనేక రీతులుగా బోధించాడు. గీత పూర్తిగా విన్న తర్వాత అర్జునుడు 'నష్టో మోహః స్మృతిర్లబ్ధా'

అని అంటాడు. 'నా మోహం తొలిగింది. నాకు ఆత్మ స్మృతి లభించింది.' అని దాని అర్థం. కాబట్టి శోక మోహాలకు గురి అయి కిం కర్తవ్యతా విమూఢుడై ఏడుస్తున్న అర్జునుని ముందు బెట్టుకొని భగవంతుడు గావించిన గీతాబోధకు మోహనాశనము, ఆత్మజ్ఞాన ప్రాప్తి తద్ద్వారా కర్తవ్య నిష్ఠ కుదరడం అనేవి ముఖ్య ప్రయోజనాలు. దీన్ని ప్రాతిపదికగా పెట్టుకొనే భారతంలో భగవద్గీత ద్వాపరయుగాంతంలో ఉద్భవించింది.

అర్జునుని మోహనివృత్తితో గీతా ప్రయోజనం పూర్తి కాలేదు. అతని వంటి జీవులెందరో ఈ అనంతమైన సృష్టిలో జన్మిస్తూనే ఉన్నారు. దుఃఖనివృత్తి, ఆనంద ప్రాప్తి వారికి కూడా అవసరమే. కాబట్టి భగవద్గీత నాటి నుండీ నేటివరకూ సాధకులకు తరణోపాయము అయింది. భగవద్గీతలో పాఠకులకు కలిగే సందేహాలను తీర్చడానికి త్రిమతాచార్యుల భాష్యాలు అనేక వ్యాఖ్యానాలు, ఉపవ్యాఖ్యానాలు ఉద్భవించాయి. అందుచేత సాధకులకు జీవితంలో ఎడనెడా కలిగే సంశయాలను నివారించడమనేది కూడా గీతకు గల ముఖ్య ప్రయోజనాల్లో ఒకటి.

ఇక శ్రీమలయాళ యతీంద్ర గీతకు సంబంధించిన పూర్వాపరాలను పరిశీలిద్దాం. ఇరవయ్యవ శతాబ్దంలో, ప్రపంచ చరిత్రలో అనేక విశిష్ట సంఘటనలు జరిగాయి. పాశ్చాత్య సంస్కృతి ఉప్పెనలా వచ్చి భారతదేశంపై బడింది. పాశ్చాత్యులు ప్రవేశపెట్టిన విద్యావిధానాలు యువతరంలో ఒక విధమైన చైతన్యాన్ని కలిగించాయి. దేనినీ గ్రుడ్డిగా విశ్వసించక, ప్రతి విషయాన్నీ జిజ్ఞాసతో ప్రశ్నించే మనస్తత్త్వం విద్యార్థుల్లో వ్యాపించింది. వారికి సరైన అవగాహనం కలగకుంటే ఆర్షధర్మానికే ముప్పు వాటిల్లే ప్రమాదం ఏర్పడింది. ఈ సంధియుగంలో పందొమ్మిదవ శతాబ్దంలో, వంగదేశంలో శ్రీరామకృష్ణ పరమహంస, కేరళలో శ్రీనారాయణ గురుదేవులు మొదలైన పెక్కు మంది మహనీయులు అవతరించారు. అటువంటి పరంపరకు చెందినవారే శ్రీమలయాళ యతీంద్రులు.

వేదవిహిత ధర్మానికి విరుద్ధమైన శాస్త్రాలు ప్రామాణికాలు కావని మన సంప్రదాయం. అయినా సర్వసమత్వ బోధకాలయిన వేద భావనలకి విరుద్ధాలైన భావాలు స్మృతుల్లోని కొన్ని భాగాల్లో చోటు చేసుకొన్నాయి. ఉపనిషత్ప్రతిపాదిత తత్త్వానికి విరుద్ధమైన ఆచార విచారాలకూ, కట్టుబాట్లకూ

పై స్మృతులు కొంతవరకూ కారణమైనాయి. పాశ్చాత్య విద్య వ్యాపించడంతో కొన్ని స్మృతుల వల్ల సమాజానికేర్పడిన అపచారాన్ని విద్యావంతులు గుర్తించగలిగారు.

ఈ పరిస్థితుల్లో శ్రీ వివేకానంద, దయానంద, రామతీర్థ, నారాయణ గురుదేవాదులు అసలైన వేద ధర్మాన్ని వివరిస్తూ, మధ్యయుగంలో భారతీయ సమాజానికి క్షతి ఎలా ఏర్పడిందో విశదీకరించారు. దానికి నివారణోపాయాలను కూడా బోధించారు. శ్రీమలయాళ స్వాములవారు కూడా చేసింది అదే.

తమ బోధలను శాశ్వతంగా సాధకులకు, సమాజానికి అందించాలని తమ ఆశయాల నన్నింటిని శ్రీమలయాళ యతీంద్రగీత రూపంలో వారు నిబద్ధం చేశారు. అక్కడ అర్జునుని ప్రశ్నల్లాగానే, ఇక్కడ శిష్యుల ప్రశ్నలున్నాయి. అక్కడ కృష్ణ భగవానుడు చెప్పినట్లే ఇక్కడ స్వామి సమాధానం చెప్పారు. అక్కడ, ఇక్కడ కూడా కర్మ, భక్తి, ధ్యాన, జ్ఞాన యోగాదులు వివరించబడ్డాయి. గీతను సవ్యాఖ్యానంగా చదివినా తీరని సంశయాలు తీరేవిధంగా శ్రీవారు యతీంద్ర గీతలో ప్రబోధాలు కావించారు. ఉదాహరణకు : 'చాతుర్వర్ణ్యం మయా సృష్టం' అని చెప్పింది గీత. ఈ మాటల్లోని ఆంతర్యం మనకు చక్కగా బోధపడదు. దానిపై వచ్చిన వ్యాఖ్యానాలలో కూడా విభిన్న మార్గాలు ఏర్పడ్డం వల్ల పాఠకులు భ్రమకు గురికాక తప్పలేదు. ఈ భ్రమను తొలగించుకోవాలంటే, యతీంద్రగీతలోని జాతి నిర్ణయ యోగాన్ని సావధానంగా, నిష్పక్షపాతంగా అధ్యయనం చేసి, అవగాహన చేసుకోవాలి. గీతలో 'పాపయోనయః' అన్న మాటను కొందరు భాష్య కర్తలు స్త్రీలకు, ద్విజేతరులకు అన్వయించారు. బహుశా ఇలాంటి కువ్యాఖ్యలే వారి ఆత్మవికాసానికి అవసరమైన విద్యాధ్యయనాదుల నడ్డగించాయి. కాలం మారింది. అలాంటి వ్యాఖ్యలను ఇప్పటిలోకం హర్షించదు. వాటివల్ల ఆర్ష ధర్మానికి మేలు కాకపోగా హాని కలుగుతూంది. అందుకే శ్రీమలయాళస్వాముల వారు భగవద్గీతకు వ్యాఖ్యానం చేస్తూ, అలాంటి ఘట్టాల్లో పూర్వుల వ్యాఖ్యలను సైతం ఖండించారు. తమ నిర్ణయాలకు హేతువులైన ఉపనిషత్తుల నన్నింటిని కలిపి, శాస్త్ర వాదాలను రెండింటినీ మేళవించి విపులంగా యతీంద్రగీతలో జాతి నిర్ణయాది యోగాలను ప్రవచించారు.

ఈ కోణంలో నుంచి చూసినట్లయితే భగవద్గీతకు, మలయాళ

యతీంద్రగీతను ఒక వ్యాఖ్యానంగా భావించవచ్చు. శ్రీ వివేకానంద స్వామి, శ్రీ నారాయణ గురుదేవులు మొదలైన ఆధునిక మహానుభావులు కావించిన అద్భుతమైన ప్రబోధాలు, సందేశాలు మన మతంలో జొరబడిన దురాచారాలను చాలవరకు తొలగించాయి. ఈ మహాప్రయత్నంలో, ఆధునిక సాహిత్యంలో మనకు ఉపకరించే శ్రీమలయాళ యతీంద్రగీత ఒక అపూర్వమైన మణిదీపం వంటిదనడంలో సందేహం లేదు. ఆధ్యాత్మిక క్షేత్రంలోనే కాక, సామాజిక రంగంలో కూడ జడత్వాన్ని రూపు మాపి, ఆత్మవికాసాన్ని పొందడానికి అవసరమైన దివ్య ప్రబోధాల రాశిగా శ్రీమలయాళ యతీంద్రగీతను పేర్కొనడం సమంజసం.

## శ్రీమలయాళ యతీంద్రగీతా వైశిష్ట్యం :

శ్రీమలయాళ యతీంద్రులవారు ఈ శతాబ్దానికి చెందిన మహనీయుల్లో అగ్రశ్రేణికి చెందినవారు. తపోనిష్ఠా గరిష్ఠులై శాశ్వత శాంతి సుఖాలను ప్రసాదించే బ్రహ్మానంద సామ్రాజ్యాన్ని వారు అనుభవించారు. 'స్వయం తీర్ణః పరాం స్తారయతి' అన్న పద్ధతిలో వారు తాము సాధించిన దుఃఖ శాంతిని, ఆనంద ప్రాప్తిని అందరికీ అందుబాటులోకి తేవాలన్న సదాశయంతో, తమ ముక్తితో తృప్తి పడకుండా, ఇతరుల విమోచనానికి కూడా ఎంతో పాటుబడ్డారు. ఎన్నో నిర్మాణాత్మక కార్యక్రమాలు చేపట్టారు. గ్రంథరచన కూడా చేశారు. వారి గ్రంథాలలో తలమానికమనదగినది శ్రీ మలయాళ యతీంద్రగీత.

శ్రీ మలయాళ యతీంద్రులు వారి పరమ గురువులైన శ్రీ నారాయణ యతీంద్రుల వలె అద్వైత సంప్రదాయానికి చెందిన వారు. ''శ్రీశంకరాచార్యులు ప్రచారం చేసిన అద్వైత సంప్రదాయమే తమద''ని బాలయోగిని అనే గ్రంథంలో స్వామి స్పష్టంగా పేర్కొన్నారు. అందువల్లనే ఈ గీతలో స్వాములవారు అద్వైత సంప్రదాయాను గుణంగానే వేదాంత తత్త్వాన్ని అతి విపులంగా వివరించారు. భగవద్గీతాది గ్రంథాలు చదివేటప్పుడు కర్మ, భక్తి, జ్ఞాన, యోగ సంబంధమైన విషయాల్లో సాధకులకు అనేక సందేహాలు కలుగుతూ ఉంటాయి. ప్రాచీన భాష్యకారులు గ్రంథంలోని విషయాలను ఎంతో విపులంగా వివరించి యున్నారు. అయినా సామాన్య పాఠకులకు అవి అవగాహనకు రావు. అటువంటి జిజ్ఞాసువులు

శ్రీమలయాళ స్వాములవారిని ఆధ్యాత్మికంగా అనేక ప్రశ్నలు అడిగేవారు. గోగర్భంలో శ్రీవారు తపస్సు చేసుకొంటున్న రోజులనుంచీ ఇది జరుగుతూనే వచ్చింది. ఈ ప్రశ్నలకు స్వామి ఇచ్చే సమాధానాలు శాస్త్రీయంగానూ, సులభంగా అర్థమయ్యేలాగానూ ఉండేవి. అంతేగాక అవి దేశ కాలాలకు అనుగుణంగా కనిపించేవి. అందువల్ల స్వాములవారు తమ 'శుష్క వేదాంత తమో భాస్కరం' గ్రంథాన్ని ప్రశ్న సమాధాన రూపమయిన పద్ధతిననుసరించి వ్రాశారు.

యతీంద్ర గీతలో సాధకులైన ఎనిమిది మంది శిష్యులు వివిధ విషయాలను గురించి స్వామీజీని ప్రశ్నించడం జరిగింది. ఈ విషయాల్లో కర్మ, భక్తి, జ్ఞానాదులకు చెందిన అనేకాంశాలు ఉన్నాయి. భగవద్గీతలోని విషయాలు చదివి అప్పటికీ సందేహాలు తీరని శిష్యులకు స్వాములవారు శాస్త్ర జ్ఞానంతో పాటు, స్వానుభవాన్ని కూడా మేళవించి సమాధానాలు చెప్పారు. గృహస్థాశ్రమం ప్రధానమా? సన్న్యాసాశ్రమం ప్రధానమా? మోక్షానికి యోగం కారణమా? జ్ఞానం కారణమా? రెండూ కారణాలా? అనే ప్రశ్నలకు కూలంకషమైన సమాధానాలను ఈ గ్రంథంలో పేర్కొనడం జరిగింది. ఒక బ్రహ్మచారి బ్రహ్మచర్య స్వరూపాన్ని వివరించమని అడిగితే, బ్రహ్మచర్య వ్రతులు పాటించ వలసిన ఆహార నియమాలతో పాటు బ్రహ్మచర్యము యొక్క సర్వాంగీణమైన స్వరూపాన్ని శ్రీవారు వివరించారు. ఈ కాలంలో భౌతిక విద్యలకున్న ప్రాధాన్యం బ్రహ్మవిద్యకు లేదు. మేము బ్రహ్మవిద్యా పారంగతులమని చెప్పుకొనే వారిలో కూడా సదాచార విచారాలు కనపడటం లేదు. సదాచార సంపన్నమైన ఆత్మజ్ఞానం అత్యవసరమని స్వాములవారు విపులంగా వివరించారు. ''అనుష్ఠానాన్ని మించిన ఉత్తమకార్యం లేదని శ్రీవారి నినాదం'' స్వతహాగా వారు అనుష్ఠాన గరిష్ఠులు. శుష్క వేదాంతాన్ని వారెప్పుడు సహించలేదు. అందుచేత ఈ గీతలో అట్టి శుష్క వేదాంతాన్ని వారు నిర్దాక్షిణ్యంగా ఖండించారు.

సనాతన ధర్మాన్ని అనుసరించే హిందూజాతి కాలక్రమేణా పతనావస్థకు గురికావడానికి అనేక కారణాలున్నాయి. అందులో ప్రధానమైన కారణాలు రెండు. 1. స్త్రీలకు విద్యాధికారం లేదనడం, 2. పుట్టిన కులాన్నిబట్టి మానవుని యోగ్యతా యోగ్యతలను నిర్ణయించడం. ఇందులోని మొదటి కారణం వల్ల స్త్రీలు

ఆత్మవికాసానికి దూరమయ్యారు. రెండవ కారణం వల్ల గుణవంతులైన వారుకూడా కులం తక్కువ అన్న కారణం చేత సమాజంలో నిరాదరణకు గురి అయ్యారు. ఇందువల్ల కలిగిన అనర్థాన్ని నివారించటానికి ఆధునిక కాలంలో రాజారామ్ మోహన్‌రాయ్, దయానంద సరస్వతి వారి అనుయాయులు ఎంతో కృషి చేశారు. ఆంధ్రదేశంలో కందుకూరి వీరేశలింగం వంటివారు ఇలాంటి దోషాలను రూపుమాపడం ద్వారా సమాజాన్ని సంస్కరించడానికి పూనుకొన్నారు. కేరళలో నారాయణ గురుదేవులు ఆధ్యాత్మిక విజ్ఞాన ప్రచారంతో తృప్తిపడక, సమాజ సంస్కరణకు కూడా నడుం కట్టారు. వారి సంప్రదాయానికి చెందిన శ్రీమలయాళ స్వాములవారు ఆంధ్రదేశంలో వారి ఉద్యమాన్ని విజయవంతంగా నిర్వహించడానికి దీక్షాబద్ధులయ్యారు. కార్యరూపంలో కూడా స్త్రీలకు బ్రహ్మవిద్యను నేర్పడంలోను, జాతిభేదం పాటించకుండా గుణవంతులకు తగిన స్థానం కల్పిచండంలోను కృతకృత్యులయ్యారు. ఈ సంస్కరణోద్యమాన్ని వ్యతిరేకించే వారి వాదాలను నిశితంగా ఖండించారు. ఈ విషయంలో తమ మహోన్నత ఆశయాలను అన్నింటినీ క్రోడీకరించి ఈ గీతలో అయిదు, ఆరు అధ్యాయాల్లో నిబంధించినారు. కాబట్టి శ్రీ మలయాళ యతీంద్రగీత ఆధ్యాత్మిక రంగంలోనే కాక, సామాజిక రంగంలో కూడా సంస్కారాత్మకమయిన మహోన్నతమయిన సత్యాలను బోధించే గ్రంథంగా విశిష్టతను సంతరించుకొంది. కవిసార్వభౌమ శ్రీపాదకృష్ణమూర్తి శాస్త్రి స్వామిని 'మంత్రమూర్తి' అంటూ ప్రశంసించారు.

మల్యాళ స్వామినం తం మహిత
గుణయుతం మంత్రమూర్తిం భజేహమ్ ।

మననం చేసే వారిని రక్షించేది మంత్రం. స్వాములవారు తమ సాధనకాలంలో ఎన్నోమంత్రాలను స్వయంగా జపించి ఆ ఫలితాలను అనుభవించారు. అందుకని సాధకులకు ఉపయోగపడేటట్లు మంత్ర వివరణను, విశిష్య ప్రణవోపాసనా వైశిష్ట్యాన్ని నిరూపించినారు. ముని చర్యారూపమైన తపస్సును గూర్చి కూడ చర్చించినారు.

ఆ తర్వాత కర్మయోగంలో 'కర్మణా జాయతే' అన్న పద్ధతిని బట్టి కర్మయోగ ప్రాధాన్యతని వక్కాణించారు. కృతాది యుగాలు క్రమ ప్రాప్తాలని, ధర్మం క్రమక్రమంగా కుంటువడుతూ వచ్చి చివరియుగంలో ఏకపాదం మీద నిలిచి ఉంటుందని మనవారు విశ్వసించేవారు. ఈ విశ్వాసం వల్ల ఒక విధంగా సమాజానికి ఎంతో హాని కలిగింది. ఇది కలియుగమనీ, ఇందులో ధర్మం ఉండదనీ, పాపకృత్యాలు చేయకపోతే జీవించడం దుష్కరమనీ భావించి, అదే పనిగా అనేకులు ధర్మ విముఖులై జీవించడం జరుగుతోంది. 'యాదృశీ భావనాయస్య సిద్ధిర్భవతి తాదృశీ' అన్నట్లు తమ భావాలకు అనుగుణమైన ఫలితాలనే ప్రజలు పొందుతారు. భావాలను, ప్రవర్తనలను ఉదాత్తంగా ఉంచుకొంటే ఉదాత్త ఫలితాలు లభిస్తాయి. రాజే కాలానికి కారణమని భీష్ముడు చెబుతాడు. మన ప్రవర్తనను బట్టే యుగం రూపు దిద్దుకుంటుంది. సత్ప్రవర్తనా పరులున్నపుడు అది కృతయుగం. దుర్మార్గులున్నపుడు కలియుగం. కలియుగంలో కూడా రామకృష్ణ పరమహంసాది మహాత్ములు ఉదయించారు. అలాగే కృతాది పూర్వయుగాలలో కూడ హిరణ్యాక్షాది రాక్షసులు ఉండేవారు. ఆరంభ యుగంలో సత్పురుషులు మాత్రమే ఉండి, వారు ధర్మాచరణ చేసే వారని, తరువాత యుగాల్లో పురుష ప్రవృత్తి అధర్మాన్నాశ్రయించిందని భావించడం సమంజసం కాదు. అన్ని యుగాల్లోను అన్ని రకాల ప్రవర్తనలు కలిగిన పురుషులున్నారు. వారి ప్రవర్తననుసరించి ఆయా కాలాలను గుర్తించడం జరిగింది. అంచేత యుగాలను గురించి అర్థరహితమైన భావనలను వదలివేసి మన ప్రవర్తనను సక్రమంగా తీర్చిదిద్దుకోవాలన్నదే శ్రీవారి ప్రబోధంలోని సారాంశం. ఇది కలియుగమన్న సాకుతో కొందరు కపటాత్ములు తాము చేసే అధర్మ కార్యాలను కూడా సమర్థించుకోవడం జరుగుతూంది. ఈ దుస్థితిని నివారించడానికి శ్రీ మలయాళ యతీంద్రులు తమ రచనల ద్వారా కృషిచేశారు. సాధువులంటే సహజంగా ఇహలోకాన్ని గురించి పట్టించుకోనివారని, పరలోక భావనతో విహరించేవారని కొందరనుకొంటారు. ఇలాంటి భావన స్వాములవారికి ఉండేది కాదు. ఆత్మానందంతో అలరారే పెద్దలు, సమాజాన్ని విస్మరించకుండా సామాజిక శ్రేయస్సుకు పాటుబడాలని వారి దృఢ విశ్వాసం.

ఈ విధంగా శ్రీమలయాళ యతీంద్ర గీత ప్రాచీనాధ్యాత్మిక

విషయాలను గూర్చిన వివరణలే కాక, ఆధునిక సమాజాభివృద్ధికి అవసరమైన సంగతులను కూడ చర్చిస్తుంది. అందుచేత ఆధునిక గీతా సాహిత్యంలో శ్రీమలయాళ యతీంద్ర గీత అత్యంత విశిష్టమైనదని చెప్పడంలో సందేహం లేదు.

## శ్రీమలయాళ యతీంద్ర గీత - భగవద్గీత సాధర్మ్యాలు

శ్రీమలయాళ యతీంద్ర గీత భగవద్గీతను దృష్టిలో పెట్టుకొని కూర్చబడింది. శ్రీసద్గురు స్వాములవారు భగవద్గీతను పరమ ప్రమాణంగా భావించారు. కాన స్వయంగా భగవద్గీతకు విపులమైన వ్యాఖ్యానం కూడా వ్రాసినారు. భగవద్గీతలోని విషయాలను పెక్కింటిని తమ యతీంద్రగీతలో విశదపరచి ఉన్నారు. భగవద్గీతకు శ్రీమలయాళ యతీంద్రగీతకు అనేక విషయాలలో సాధర్మ్యం గోచరిస్తుంది.

భగవద్గీత సంవాదరూపమైనది. కృష్ణార్జునుల సంవాదమే గీతగా రూపొందింది. శ్రీ మలయాళ యతీంద్ర గీత కూడా సంవాదాత్మకమే. ఇక్కడ అనేక మంది శిష్యులు అనేక విషయాలను ప్రశ్నించినపుడు స్వామి అందుకు ఇచ్చిన సమాధానాలే శ్రీమలయాళ యతీంద్ర గీతగా రూపొందింది.

భగవద్గీతలో 18 అధ్యాయాలు ఉంటే, యతీంద్రగీతలో కూడా అధ్యాయాలు పదునెనిమిదే ఉన్నాయి. భగవద్గీతలోని అధ్యాయాలకు యోగాలని పేరుపెట్టినట్లే శ్రీమలయాళ యతీంద్రగీతలో కూడా అధ్యాయాలన్నీ యోగనామాలతోనే వ్యవహరింప బడినాయి.

భగవద్గీతలో మూడవది కర్మయోగము, నాలుగవది జ్ఞానయోగము, ఐదవది కర్మసన్న్యాసయోగము, పండ్రెండవది భక్తియోగము, పదహారవది దైవాసుర సంపద్విభాగయోగం, పదునెనిమిదవది మోక్ష సన్న్యాసయోగము. యతీంద్రగీతలో మొదటిది జ్ఞానయోగం. తొమ్మిదవది కర్మయోగం, పదకొండవది భక్తి ప్రభావయోగం, పదమూడవది కర్మసన్న్యాసయోగం, పదునాలుగవది దైవాసుర స్వరూపయోగం, పదిహేడవది మోక్షసన్న్యాసయోగం.

ఈ విధంగా ఉభయ గ్రంథాలలోను ఆరుయోగాలు ఇంచుమించు ఒకేపేరుతో, స్థాన భేదంతో కూర్చబడినాయి. విషయ సామ్యం కూడా ఉంది.

అంతేకాకుండా కించిద్భేదంతో గీతా శ్లోకాలనే ఉట్టంకించడం జరిగింది.

భగవద్గీత జ్ఞానయోగ ప్రాధాన్యాన్ని వివరించినట్టుగానే, మలయాళ యతీంద్రగీత కూడా జ్ఞాన ప్రాధాన్యాన్నిలా చెబుతుంది.

**జ్ఞాన యోగో హి యోగానాం శ్రేష్ఠో భామ ఫలప్రదః ।**
**జ్ఞాన యోగ స్థిత బ్రహ్మ నిష్ఠానాం నిష్కళాత్మనామ్ ॥ I - 81**

భగవద్గీత పదిహేడవ అధ్యాయంలో బ్రహ్మచర్యాన్ని శరీర తపస్సుగా పేర్కొంటే, మలయాళ యతీంద్రగీత బ్రహ్మచర్య ప్రభావ యోగాన్ని వివరించడానికి ఒక అధ్యాయాన్నంతటిని కేటాయించింది. బ్రహ్మచర్యంలోని భేదాలు, అనుష్ఠానాది విషయాలను అన్నింటినీ ఇచట నిరూపించింది. మూడు శ్లోకాల్లో సాత్త్విక, రాజసిక, తామసిక ఆహారభేదాలను భగవద్గీత సూక్ష్మంగా ప్రతిపాదిస్తే, మలయాళ యతీంద్రగీత తన బ్రహ్మచర్య ప్రభావయోగంలో ఎనిమిది శ్లోకాల్లో మరింత విపులంగా వివరించింది.

భగవద్గీత పదవ అధ్యాయంలో 'అధ్యాత్మ విద్యావిద్యానాం వాదః ప్రవదతామహమ్' అని బ్రహ్మవిద్యా ప్రాశస్త్యం నొక్కి వక్కాణించబడింది. యతీంద్రగీతలో నాల్గవ అధ్యాయమైన విద్యాయోగంలోనూ, పండ్రెండవ అధ్యాయమైన విద్యాక విద్యాలక్షణయోగం' లోనూ, పరాపర విద్యలు రెండింటి ప్రాముఖ్యాన్ని విశదీకరించడం జరిగింది.

ఓంకారమనే ప్రణవమంత్రం జపిస్తూ శరీరం వదలినవాడు పరాగతిని పొందుతున్నాడని భగవద్గీత సూచించగా, ఆ ప్రణవ మంత్ర ప్రాధాన్యాన్ని శ్రీ మలయాళ యతీంద్రగీత మంత్ర వివరణ యోగమనే పేరుతో ఒక అధ్యాయంలో పూర్తిగా విశదీకరించింది.

భగవద్గీతలాగానే యతీంద్రగీత కూడా తపస్సును సాత్త్విక, రాజసిక, తామసిక తపస్సులని మూడు విధాలుగా విభజించింది. వాటిలో జ్ఞాన తపస్సు శ్రేష్ఠమైనదిగా గుర్తిస్తుంది అలాగే తపస్సును శారీరిక, వాచిక, మానసికమని భగవద్గీతలో లాగా యతీంద్రగీత కూడా మూడు విధాలుగా సూచించింది.

భగవద్గీతలో మూడవ అధ్యాయం కర్మయోగం కాగా, యతీంద్రగీతలో తొమ్మిదవ అధ్యాయం కర్మయోగం. నిష్కామకర్మని బోధించే భగవద్గీత నిష్కామ కర్మ నాచరించిన వాడే చిత్తశుద్ధిని పొందగలడని తెలిపితే, యతీంద్రగీతలో నిష్కామకర్మమే జ్ఞానాది యోగాలకు పునాది అని చెబుతుంది. బ్రహ్మప్రాప్తి సాధనకు బహుకాల పరిశ్రమ అవసరమని ఉభయగీతల అభిప్రాయం.

భగవద్గీతలో ఐదవ అధ్యాయం, యతీంద్రగీతలో పదమూడవ అధ్యాయం కర్మసన్న్యాసమను పేరుతో ఉన్నాయి. లోక సంగ్రహంకోసం కర్మచేయాలనే గీతావాక్యాన్ని యతీంద్రగీత మరింత స్పష్టంగా వివరిస్తుంది.

భగవద్గీతలో పదహారవది దైవాసుర సంపద్విభాగయోగం కాగా, యతీంద్రగీతలో ఆయోగం పదునాల్గవ అధ్యాయమయింది. భగవద్గీతలో మొదటి మూడు శ్లోకాల్లో చెప్పిన దైవాసుర సంపదల విషయాలని యతీంద్రగీత ఒక అధ్యాయం పూర్తిగా విశదీకరిస్తుంది.

భగవద్గీతలో చివరి అధ్యాయం మోక్ష సన్న్యాసయోగం అయితే, యతీంద్రగీతలో పదిహేడవది మోక్షసన్న్యాసయోగం, మోక్షం కొరకు సన్న్యసించాలని, మోక్షాన్ని గూడ సన్యసించాలని భగవద్గీతలో అన్వయమవుతోంది. మోక్షాన్ని గూడ సన్న్యసించాలనే విషయాన్ని యతీంద్రగీత స్పష్టంగా వివరిస్తూ, ముక్తుడైన వాడు మోక్షం పొందినాడు కాబట్టి, మోక్షం కూడా సన్న్యసిస్తాడు. యథార్థ దృష్టితో చూస్తే ఆత్మకు బంధం కల్పితమే కాని నిజం కాదు. అందువల్ల ఆత్మ ఎప్పుడూ ముక్తమే. మోక్షాన్ని మళ్ళీ కొత్తగా కోరవలసిన పనిలేదు అని మోక్షాన్ని కూడా సన్న్యసించాలని మలయాళ యతీంద్ర గీతా సారాంశం.

## వైధర్మ్యాలు :

అనేక విషయాలలో భగవద్గీతనే అనుసరించినా, భగవద్గీతలో ఏ మాత్రమూ స్పృశించని సామాజిక విషయాలను ముచ్చటించడం ద్వారా యతీంద్రగీత తన ప్రత్యేకతను నిలుపుకొంది. అటువంటి వాటిలో ప్రధానమైన వైధర్మ్యాంశాలు ఇలా ఉన్నాయి.

భగవద్గీతలో అర్జునుడొక్కడే పృచ్ఛకుడు. భగవానుడు అతని ప్రశ్నలకు సమాధానమిస్తాడు. యతీంద్రగీతలో పృచ్ఛకులు అనేకులు. భగవద్గీతలో అర్జునుని సంశయాలు తొలగితే, యతీంద్రగీతలో శిష్యుల సంశయాలు ఛిన్నమౌతాయి. అక్కడ బోధించింది కృష్ణుడు. ఇక్కడ బోధించింది గురువు. అది ద్వాపర యుగాంతంలో జరిగిన బోధ. ఇది ఇరవయ్యో శతాబ్దంలో జరిగిన బోధ. అది యుద్ధ రంగంలో జరిగిన బోధ. ఇది ఆశ్రమ వాటికలో జరిగిన బోధ. అది భారతాంతర్గత గీత ఇది స్వతంత్ర గీత.

భగవద్గీతలో 700 శ్లోకాలున్నాయి. శ్రీమలయాళ యతీంద్రగీతలో 1120 శ్లోకాలున్నాయి. భగవద్గీతలో లేనివి. మలయాళ యతీంద్రగీతలో ఉన్నవి మొత్తం పంద్రెండు అధ్యాయాలు అవి యోగ విజ్ఞాన యోగం, బ్రహ్మచర్య ప్రభావయోగం, విద్యాయోగం, స్త్రీవిద్యాధికారయోగం, జాతి నిర్ణయ యోగము, మన్త్ర వివరణ యోగం, తపః ప్రభావయోగం, అష్టాంగయోగం, విద్యా ऽ విద్యాలక్షణయోగం, యుగనిర్ణయ యోగం, వైరాగ్యయోగం, నిర్వాణయోగం.

కృష్ణుడు గీతలో స్త్రీలను గురించి 'కీర్తిః శ్రీర్వాక్చనారీణాం స్మృతిర్మేధా ధృతిఃక్షమా' అని అంటాడు. అంటే స్త్రీల యందలి కీర్తి, ఐశ్వర్యము, వాక్ఛమత్కృతి, ధారణాశక్తి, బుద్ధిబలము, ధైర్యము, ఓర్పు తన స్వరూపాలే అని పేర్కొన్నా స్పష్టంగా బ్రహ్మవిద్యాధికారంలో వారికి కూడా అర్హత ఉందని ఎక్కడా చెప్పలేదు. అయితే స్వామి యతీంద్రగీతలో స్త్రీలను గురించి, వారి యోగ్యతలను గురించి తెలియజేయడానికి ఒక అధ్యాయాన్నంతా కేటాయించారు.

స్త్రీ, పురుష, శూద్రులు ఎవరైనా, రోగగ్రస్తులైనపుడు ఔషధసేవన చేయుటలో ఎలా అధికారం కలిగి ఉన్నారో, అలాగే బ్రహ్మవిద్యయందు కూడా అధికారం కలిగి యున్నారు. చూడాల, మదాలసాది గృహస్థులు, కాత్యాయని, శార్గి, సులభ, విశ్వవర, మైత్రేయి మొదలగు తపస్వినులు బ్రహ్మవిద్యను పొందినట్లుగా ఉపనిషత్తులు ఘోషిస్తున్నాయి. అలాగే విద్యాధిదేవతలుగా, ధనాది దేవతలుగా, శక్తి స్వరూపాలుగా స్త్రీలే ఆరాధించబడుతున్నారు. కనుక స్త్రీలందరికీ బ్రహ్మ విద్యాధికారం కలదని స్వామి అనేక ప్రమాణాలతో స్త్రీ విద్యాధికారంలో నిరూపించినారు.

భగవద్గీతలో కృష్ణుడు గుణకర్మల నాధారం చేసుకొని నాలుగు వర్ణాలను ఏర్పరిచానన్న వాక్యానికి వ్యాఖ్యానం చేయడానికా అన్నట్లు, స్వామి ఒక అధ్యాయాన్నంతా కేటాయించి 'జాతి నిర్ణయ యోగము'నే పేరుతో విపులంగా విశదీకరించారు.

పురుషసూక్తంలో ఈ వర్ణాల ప్రస్తావన ఉంది. జాతి గుణభేదాన్ని బట్టి ఏర్పడుతుంది కాని, జన్మను బట్టి కాదని తేల్చి చెప్పబడింది. వేదాంతాధికారం కులక్రమాగతం కాదనీ, అది జిజ్ఞాసాధీనమనీ గుర్తింపకపోవడమే భారతదేశ ప్రస్తుత స్థితికి కారణమని, ఈ స్థితిని సంస్కరించుకోవాలని యతీంద్రగీత ప్రతిపాదిస్తుంది. ఒకే జాతి ఒకే జన్మలో గుణకర్మలను నిమిత్తంగా జేసుకొని నానాజాతులుగా రూపుదాల్చిందని స్వామి తొంభై ఒక్క శ్లోకాల్లో ప్రమాణంతో వివరించినారు.

భగవద్గీతలో చెప్పబడిన నిర్గుణభక్తిని యతీంద్రగీత పరాభక్తిగా పేర్కొంటుంది.

మలయాళ యతీంద్రగీతలోని యుగనిర్ణయయోగం శ్రీమలయాళ స్వాములవారి విప్లవాత్మక భావాలకు ప్రతీక లాంటిది. కేవలం ధర్మం, కేవలం అధర్మం ఎప్పుడూ ఎక్కడా ఉండవని, ధర్మాధర్మాలు అన్ని కాలాల్లోనూ, అన్ని ప్రదేశాల్లోనూ ఎప్పుడూ ఉంటాయని, వాటి నిష్పత్తిలో మాత్రమే తేడా ఉంటుందని, అటువంటి తేడాలే భిన్నమైన యుగనామాలుగా వ్యవహరింపబడినాయని స్వాములవారి అభిప్రాయం. కృత, త్రేతా, ద్వాపర, కలియుగాల్లో ప్రహ్లాద, రామ, కృష్ణ, శంకరాచార్యాది సత్పురుషుల వలెనే హిరణ్యకశిపు, రావణ, కంసాదులు కూడా జీవించారని, అందుచేత కేవలం ధర్మాధర్మాల నాధారం చేసుకొని యుగనిర్ణయం చేయరాదని, ఒకే కాలంలోనే నాలుగు యుగాలు యిమిడి ఉంటాయని ప్రతిపాదించినారు. ఈ విధంగా యుగరహస్యాన్ని గురించి స్వాములవారు ప్రమాణాలతో, భగవద్గీతలో లేని విషయాన్ని పదునైదవ అధ్యాయంతో విశదీకరించినారు.

మోక్షసాధనలో వైరాగ్యం యొక్క ప్రాధాన్యతని గుర్తించి, స్వామి ఒక ప్రత్యేకమైన అధ్యాయాన్ని దాని కోసమే కేటాయించినారు. అందులో వైరాగ్య

భేదాలని, స్వరూపాలని ఎంతో సులభంగా బోధించారు. మలినమని, శుద్ధమని, వైరాగ్యం రెండు రకాలు. వాటినే స్వభావ వైరాగ్యం, అభావ వైరాగ్యం అని కూడా అంటారు. స్వభావవైరాగ్యం, పూర్వజన్మ సంస్కారాన్ని అనుసరించి బహు కొంతమందికి మాత్రమే వచ్చేది. ఇది స్థిరమైనది. సజ్జనులకు ప్రీతి కలిగించేది. మోక్షప్రదమైనది. శాశ్వతానంద దాయకమైనది. మలినవైరాగ్యం శ్మశానవైరాగ్యం, ప్రసూతి వైరాగ్యం, పురాణవైరాగ్యం, వియోగవైరాగ్యం అని పలురకాలు అవుతుంది. అది నీటి బుడగవలె అశాశ్వతమైనది.

వైరాగ్యాన్ని మరొక దృక్కోణం నుంచి వస్తు వైరాగ్యం. భావ వై రాగ్యమని స్వాములవారు రెండు రకాలుగా విభజించారు. ఈ రెండూ సాధకుడు పూర్ణ స్థితి నొందడానికి సహకరిస్తాయి. నామరూపాల పైన విరక్తి వస్తువైరాగ్యమని పిలువబడితే, ఆ నామరూపాలు బ్రహ్మంగానే భాసించటాన్ని భావవైరాగ్యమనవచ్చు. విషయాలు బద్ధహేతువులని భావించి, నిర్విషయమైన బ్రహ్మమును మాత్రమే ధ్యానించుట భావవైరాగ్యమౌతుంది.

విషయవైరాగ్యమే మోక్షమనీ, విషయాసక్తియే బంధమని అష్టావక్రముని చెపుతాడు. వైరాగ్యం లేనివాడు అజ్ఞానాన్ని తొలగించుకోలేడని, భక్తి అనే తైలం నశిస్తే ముక్తి అనే జ్యోతి వెలుగదని స్వాములవారు ప్రకటించారు. ఈ విధంగా స్వామి భగవద్గీతలో లేని వైరాగ్యయోగాన్ని గూర్చి విపులీకరించినారు.

భగవద్గీతలో మోక్షం 'బ్రాహ్మీస్థితి' 'బ్రహ్మనిర్వాణం' అని నిర్వచింపబడితే, దానినే శ్రీమలయాళ స్వాములవారు 'నిర్వాణమ'ని పలు పర్యాయాలు ఉపయోగించినారు. ఆస్తిక దర్శనాలు అత్యంత దుఃఖవియోగం, పరమపదం, పరమపురుషార్థం అని మోక్ష స్వరూపాన్ని వివరిస్తే, నాస్తికమతాలు ముఖ్యంగా బౌద్ధం అటువంటి స్థితిని నిర్వాణమని పేర్కొంటుంది. ఎవరు ఏ శబ్దంతో పిలిచినా జీవాత్మ భవబంధం నుండి విడివడి బ్రహ్మైక్యస్థితిని సాధించడమే మోక్షమని ప్రాచీనుల అభిమతం.

సకలయోగాల సారమైనందున మలయాళస్వాముల వారు తమ 'యతీంద్రగీత'ను నిర్వాణయోగంతో ముగించినారు. యోగవాసిష్ఠంలో కూడా చివరిది నిర్వాణ ప్రకరణం కావడం మనం గమనించవచ్చు. నిర్వాణమనగా మోక్షం

అటువంటి మోక్షం సన్న్యాసఫలమని, అఖండకేవల శివప్రదమని, మహాజ్యోతియని, ఆనంద ఘనమని, ప్రజ్ఞా స్వరూపమని, పరిపూర్ణమని, మాయారహితమని, జ్ఞాన స్వరూపమని పేర్కొన్నారు. బుద్ధ, శంకర, రామానుజ, మధ్వాదులు కనుగొన్న పరమతత్త్వసారమే నిర్వాణమని, అటువంటి నిర్వాణమునకే శివత్వం, బ్రహ్మత్వం, విష్ణుత్వం, స్వర్గం, కైవల్యం, అర్హత్, ముక్తి అనేవి పర్యాయ పదాలని స్వాములవారు బోధించారు.

పురోభివృద్ధి గోరువారు పూర్వ వృత్తాంతమును మరువరాదు.

పుస్తకములను పరిశోధించుటతో తృప్తినొందక మస్తకములను కూడా పరిశోధింపుడు.

భుక్తికై ఉద్యోగము చేయువారే వేళకు పనిచేయుచుండగా శాశ్వతమగు ముక్తికై ఉద్యోగమొనర్చువారు ఎంత జాగరూకులై యుండవలెనో యోచింపుడు.

గాలివీవనప్పుడు రాళ్ళు, ఎండుటాకులు ఒకే విధమున పడి యుండును. వీచినచో ఎండుటాకులు ఎగిరిపోయి రాళ్ళుమాత్రము స్థిరముగా నిలుచును. అన్నియు అనుకూలముగా ఉన్నప్పుడు అందఱును పెద్దలవలెనుందురు. వికట పరిస్థితులేర్పడినప్పుడు విపత్తులెదురైనప్పుడు సామాన్యుడు మనశ్శాంతిని గోల్పోవును. స్థిత ప్రజ్ఞుడు మాత్రము పరిస్థితుల ప్రభావమునకు లోబడక సదా ఆనందమగ్నుడై యుండును. జ్ఞానికిని, అజ్ఞానికిని గల భేదమిదియే.

దేహమను క్షేత్రములో ఎవరు పరమాత్మను బొడగాంచగలరో అట్టి మహాత్ములున్న స్థలము దివ్యక్షేత్రము.

శ్రీ మలయాళ స్వామి

## తృతీయాధ్యాయం

# యతీంద్రగీత -పరమ పురుషార్థం -తత్సాధనాలు

భారతీయ సంప్రదాయంలో నాలుగు పురుషార్థాలు పేర్కొనబడ్డాయి. ధర్మం, అర్థం, కామం, మోక్షం అనేవే ఆ పురుషార్థాలు. వీటిలో అర్థమూ, కామమూ ధర్మాన్ని అనుసరించే ఉండాలని శాస్త్రాలు విధించాయి. ధర్మ విరుద్ధంగా ఆర్జించిన అర్థం పాపహేతువౌతుంది. కామం కూడా అంతే. అందుకే ''ధర్మా విరుద్ధో భూతేషు కామోఽస్మి భరతర్షభ'' అని శ్రీకృష్ణుడు అంటాడు. అట్టి ధర్మ పరిరక్షణకే భగవంతుడవతరించాడు. గీతను బోధించాడు.

ధర్మార్థకామాలను త్రివర్గమని కూడా అంటారు. ఇక మోక్షమనేది పరమ పురుషార్థంగా ప్రశస్తి వహించింది. వర్గత్రయం మోక్షానికి కారణమైనపుడే దాన్ని అనుసరించే మానవజన్మకు సాఫల్యం సిద్ధిస్తుంది. వ్యాసవిరచిత మహాభారతం ఈ నాలుగు పురుషార్థాలను లోకోత్తరంగా వివరించడానికే ఆవిర్భవించింది. అందువల్లనే ''ధర్మేచా ర్థే చ కామే చ మోక్షే చ భరతర్షభ! యది హాస్తి తదన్యత్ర యన్నేహాస్తి నతత్ క్వచిత్'' అన్న ప్రశస్తి కలిగింది. శాంతి, ఆనుశాసనిక పర్వాలలో ధర్మాలు విపులంగా నిరూపించబడినాయి. అర్థకామాలను కూడా యథోచితంగా ధర్మానికి విరుద్ధం కాని పద్ధతిలో సాధించాలని భారతం యెడనెడా వివరించింది.

చతుర్థ పురుషార్థమైన మోక్షం సమస్తబంధాలు పటాపంచలైతే గాని సిద్ధించదు. మాయామోహితుడైన జీవుడు సంసారంలో చిక్కుకొని స్వస్వరూపం మరచిపోయాడు. అతడిని విస్మృతి అవరించింది. ఈ విస్మృతి తొలగి స్మృతి కలగాలంటే, శోక మోహాలు నశించాలి. శోకమోహాలు దూరం కావాలంటే అందుకు ఆత్మజ్ఞానం తప్ప మరొక సాధనం లేదు. ఉపనిషత్ప్రతిపాదితమైన పరావిద్య చేత మాత్రమే ఆత్మజ్ఞానం సిద్ధిస్తుంది. అదే బ్రహ్మవిద్య. అదే యోగశాస్త్రం. కురుక్షేత్రంలో అర్జునుడికి కృష్ణుడు బోధించిన తత్త్వం అదే. భారతంలో బ్రహ్మవిద్యా స్వరూపం అక్కడక్కడా పరిమిత స్థాయిలో వివరించబడి ఉండవచ్చు. కాని భగవద్గీతలో మాత్రమే అది పూర్ణస్థాయిలో వివరించబడింది. అందుచేతనే ప్రతి అధ్యాయం చివరన 'ఇతి శ్రీమద్భగవద్గీతాసూపనిషత్సు, బ్రహ్మవిద్యాయాం యోగశాస్త్రే' అని పేర్కొనడం జరిగింది. అందువల్ల పరమపురుషార్థమైన మోక్షం

పొందడానికి అవసరమైన సాధనలను బోధించే యోగశాస్త్రమే భగవద్గీత. గీతలోని ప్రతి అధ్యాయమూ ఒక యోగమే. అర్జునుని విషాదయోగంతో ప్రారంభమైన ఈ గ్రంథం చివరికి మోక్ష సన్న్యాసయోగంతో ముగిసింది.

గీతా ప్రచారకులుగా, గీతా తత్త్వానుష్ఠాన పరులుగా గీతా మూర్తులుగా పేరొందిన శ్రీమలయాళ స్వాములవారు అద్వైత మతానుయాయులు. వీరి సంప్రదాయానికి ఆదిగురువులు శంకరాచార్యులు. అందుచేత స్వాములవారు, భగవద్గీతననుసరించి నిర్మించిన శ్రీమలయాళ యతీంద్రగీతలో కూడా, భగవద్గీతలో ప్రతిపాదింపబడిన పరమపురుషార్థమైన మోక్షాన్ని, దానికవసరమయిన సాధనలని విపులంగా వివరించారు.

మోక్షప్రాప్తికి అనుష్ఠానం ప్రధాన సాధనమని శ్రీమలయాళ యతీంద్రగీత పేర్కొంటుంది.

**నానుష్ఠానాత్పరం కార్యం త్రిషు లోకేషు విద్యతే ।**
**నానుష్ఠానాత్పరోధర్మో నానుష్ఠానాత్పరం తపః ॥ I - 24**

ఈ అనుష్ఠానంలోనే కర్మయోగాది సాధనలన్నీ ఇమిడి ఉన్నాయి. అనుష్ఠానానికి గృహస్థులు, సన్న్యాసులు అన్న భేదం లేదు. సదనుష్ఠాన పరులైన వారెవరైనా జ్ఞాన గరిష్ఠులై మోక్షం పొందగలరని స్వాములవారు ఆరంభంలోనే ప్రతిజ్ఞా వాక్యాన్ని పలికారు.

ముక్తికి కారణం ఆశ్రమమా? అరణ్యవాసమా? కర్మయా? గృహమా? అంటే ఇవేవీకావు.

**నాశ్రమం కారణం ముక్తేర్వనాని గృహాణి చ ।**
**తథైవ సర్వ కర్మాణి శుద్ధిరేవహి కారణమ్ ॥ I - 35**

ఆత్మశుద్ధి ఒక్కటే ముక్తికి కారణం అని యతీంద్రగీత ప్రతిపాదిస్తుంది. ఇక్కడ 'న కర్మణా న ప్రజయా ధనేన' అనే శ్రుతివచనం గుర్తుకు వస్తుంది. పరమ పురుషార్థమైన మోక్షం జ్ఞాన సిద్ధికి ఫలం. అయితే జ్ఞాన సిద్ధి అంటే ఏమిటి? అదే భావశుద్ధి, ఆత్మశుద్ధి, హృదయశుద్ధి, బాహ్యవేషాలు, ఆడంబరాలు, పటాటోపాలు మోక్షప్రాప్తిని కలిగించవు. ఒక్క ఆత్మశుద్ధి మాత్రమే మోక్ష హేతువౌతుంది. అటువంటి ఆత్మశుద్ధిని పొందాలంటే నిష్కామ కర్మానుష్ఠానం, భగవదుపాసన,

బ్రహ్మ విజ్ఞానం అవసరం అవుతాయి. అవే కర్మ, భక్తి, జ్ఞాన యోగాలు.

**వర్ణో యథా మలిన పటే నహి సంక్రామతే క్వచిత్ ।**
**తథాత్మ శుద్ధి హీనానామాత్మ బోధోన సజ్జతే ॥ IX - 62**
**క్షాళితే హి పటే శుద్ధే యథా వర్ణః ప్రసజ్జతే ।**
**శుద్ధాత్మని తథా యోగైరాత్మ బోధః ప్రసజ్జతే ॥ XI - 63**

కొత్త వస్త్రానికి లేదా ఉతికిన వస్త్రానికి మాత్రమే రంగు పడుతుంది. మలిన వస్త్రానికి రంగు పట్టదు. అలాగే సదాచారం చేత, సదనుష్ఠానం చేత హృదయశుద్ధి పొందిన వారికి మాత్రమే మోక్ష ఫలప్రదమైన ఆత్మబోధ కలుగుతుంది. జ్ఞానం దృఢపడాలంటే పై మూడు యోగాలు అవసరమే.

**దర్పణేన వినా దీపో యథా వాతైర్వినంక్ష్యతి ।**
**యోగాది రహితం జ్ఞానం తథా నంక్ష్యతి వృత్తిభిః ॥ I - 65**

పెనుగాలిలో దీపం నిలువదు. చిమ్నీలోపలి దీపం స్థిరంగా ఉంటుంది. జ్ఞానదీపం విషయవృత్తులనే పెనుగాలుల వల్ల ఆరిపోయే ప్రమాదం ఉంది. అందువల్ల కర్మ, భక్తి, యోగాలనే దర్పణంతో జ్ఞానదీపాన్ని పరిరక్షించాలి. జ్ఞానం కోరేవాడు సమాధిని సాధించాలి. కర్మ, భక్తి, జ్ఞాన యోగాలు మూడింటిని చక్కగా అనుష్ఠిస్తేనే సమాధి యోగం సిద్ధిస్తుంది. ఆత్మశుద్ధి కలుగుతుంది. జ్ఞానం దృఢపడుతుంది. 'జ్ఞానాదేవ చకైవల్యమ్' అన్నట్లు జ్ఞానం వల్ల మోక్షం సిద్ధిస్తుంది.

ఒక్కొక్క కాలంలో ఒక్కొక్క మహనీయుడు ఒక్కొక్క యోగాన్ని ప్రధానంగా బోధించాడు. తాను ప్రధానమని బోధించిన యోగం ముఖ్యమని, ఇతర యోగాలు వ్యర్థమని ప్రతిపాదిస్తాడు. ఇలాంటి బోధలను మనం ఉన్నది ఉన్నట్లుగా స్వీకరించరాదు. ఇక్కడ 'న హి నిందా న్యాయం' పాటించాలి. నింద నిందించుటకు వచ్చింది కాదు గాని పొగడదగిన దాన్ని పొగడటానికే వచ్చింది. గనుక రామానుజులు మొదలైనవారు కాలానికనుగుణంగా మోక్షానికి భక్తి ప్రపత్తులే ప్రధాన సాధనాలని బోధించారు. ఆధునిక గీతా వ్యాఖ్యాతల్లో అగ్రగణ్యుడైన తిలక్ మహాశయుడు కర్మ యోగమే గీతలో ప్రతిపాద్యమన్నాడు. ఆదిశంకరులు కర్మ, జ్ఞాన, సముచ్ఛయ వాదాన్ని తృణీకరించి జ్ఞానయోగమే ప్రధానమని చెప్పారు. వారి

వారి అర్హతను బట్టి ఆయా యోగాలు అనుసరణీయాలు అని శ్రీరామకృష్ణ పరమహంస మొదలైన వారు ఒక చక్కని సమన్వయ మార్గాన్ని ఉపదేశించారు. అటువంటి మార్గాన్ని అనుసరించిన వారిలో శ్రీమలయాళ యతీంద్రులు ఒకరు.

నాలుగు స్తంభాల మీద నిలబడిన మండపంలో ఏ స్తంభం ప్రధానం? నాలుగు పాదాలపైన నడిచే గోవుకి ఏ పాదం ప్రధానం? వీటిలో దేని ప్రాధాన్యం దానికి వుండనే ఉంటుంది. అలాగే దేశకాల పాత్రానుగుణంగా ఆయా యోగాలు ఆయా సందర్భాలలో ప్రాముఖ్యాన్ని సంతరించుకొంటాయి. చివరికి అన్ని యోగాలు ఆత్మశుద్ధికి కారణాలు కావలసిందే. లేకపోతే మోక్షంరాదు. ఈ విషయాన్నే యతీంద్రగీత నొక్కి-వక్కాణించింది. శ్రీమలయాళ యతీంద్రులు అద్వైత మతాన్ని అనుసరిస్తూనే తమ గీతలో సర్వయోగ సమన్వయాత్మకమైన పద్ధతిలో ప్రబోధం కావించారు. ఇందువల్ల ప్రాచీన గ్రంథాలు చదివినపుడు కలిగే సందేహాలు కూడా మనకు పరిష్కారమౌతాయి. ఆధునిక యుగం సమన్వయ యుగమే గాని సాధింపుల యుగం కాదు. ఆ సమన్వయానికి యతీంద్రగీత ఒక చక్కని ప్రాతిపదిక.

## పురుషార్థ సాధనలు :

### కర్మమార్గం :

సనాతన ధర్మానికి మూలభూతమైన వేదం కర్మకాండ, ఉపాసనాకాండ, జ్ఞాన కాండ అని మూడు కాండలుగా విభజింపబడింది. సకామ కర్మ, నిష్కామకర్మ అని కర్మలు రెండు రకాలు. స్వర్గాది ఫలాలనుద్దేశించి లేదా లౌకిక ప్రయోజనాలను ఆశించి చేసే కర్మలు సకామ కర్మలనబడతాయి. ఫలాపేక్ష లేకుండా చేసే కర్మలు నిష్కామ కర్మలనబడతాయి. నిష్కామకర్మలో ఆ కర్మ చేసే వానికి కర్మ ఫలాపేక్షగాని కర్తృత్వ బుద్ధిగాని వుండవు. సంగం లేకుండా కర్మలు చేయబడతాయి. నిష్కామ కర్మయోగి అయినవాడు శరీరధారణ కోసం చేసే కర్తవ్య కర్మలను కూడా ఈశ్వరార్పణం చేసి ఆచరిస్తూంటాడు. భగవద్గీతలో నిష్కామ కర్మయోగం చాలా ప్రధానమైనది. సకామ కర్మ బంధ హేతువౌతుంది. నిష్కామకర్మ బంధం కలిగించదు. అందుకే భగవద్గీత అనాసక్తుడై కర్మ చేసేవాడు పరమపదాన్ని

పొందుతాడని, యజ్ఞం కోసం కాని కర్మలు బంధహేతువులౌతాయని చెబుతుంది. ఈ కర్మలన్నీ చిత్తశుద్ధి కోసమేనని వేదాంత శాస్త్రం బోధిస్తుంది.

శ్రీ మలయాళ యతీంద్రులు తమ గీతలో అద్వైత వేదాంత ప్రక్రియననుసరించి కర్మయోగాన్ని వివరించారు.

> అష్టాఙ్గ యోగాది సుతీవ్రభక్తే
> ర్వినాపి యః కశ్చన తత్త్వవేదకః ।
> తేనాపి సర్వం గతజన్మ సాధితం
> ఆదర్శయోగే హి విభాతి ధీ ప్రభా ॥ II - 15

జ్ఞాని అయినవాడు తప్పక నిష్కామ కర్మ నాచరించి వుంటాడు. ఈ జన్మలో కర్మాచరణం చేయని జ్ఞాని, గత జన్మలో చేసి వుంటాడని గ్రహించాలి.

> చిత్తోపశాన్తి ర్హృదయస్య శుద్ధి ర్నైశ్చల్య భావః పరమాత్మ విత్తిః ।
> ఏతైర్వినా యస్య వచః ప్రబోధః శుకస్య వాణీవ సకర్ణపేయః ॥ II - 17

విరక్తుడై ఏకాంత వాసంలో నున్నవాడు వైదిక స్మార్తాది కర్మలని నిందించరాదని, అలా నిందించేవాడు మూఢుడని స్వామి అభిప్రాయం.

> ఫలాసక్త్యా ప్రయతతాం కర్మయోగో న సిద్ధ్యతి ।
> తథా దేహేన్ద్రియ మనోయుజాం జ్ఞానం న సిద్ధ్యతి ॥ IX - 7
> విషలేశో యథాహన్తి క్షీరాన్నమఖిలం తథా ।
> దేహాత్మ భావనా స్వార్థా జ్ఞాన కర్మద్వయం హతః ॥ IX - 9

భగవద్గీత చెప్పినట్లే యతీంద్రగీత కూడ ఫలాపేక్షతో కర్మలాచరించు వాడికి కర్మయోగం సిద్ధించదని, విషం కొంచెమైనా మొత్తం క్షీరాన్నాన్ని చెరచినట్లు, స్వార్థబుద్ధి ఏ మాత్రం వున్నా నిష్కామకర్మను చెడగొడ్తుందని చెబుతుంది.

> కర్మయోగం విచరతో దైవార్పిత మనీషయా ।
> దైవానుగ్రహయోగేన చిత్తశుద్ధిః ప్రజాయతే ॥ IX - 17

దైవార్పిత బుద్ధితో కర్మయోగము ఆచరిస్తే దైవానుగ్రహం వల్ల మలదోష కలితమైన అంతఃకరణం పరిశుద్ధమౌతుంది. అలాంటి కర్మనే నిష్కామ కర్మ అంటారు.

కర్మలన్నీ బంధుహేతువులేనా అన్న సందేహానికి స్వాములవారు ఇలా చెబుతారు. లోకక్షేమం కోసం విధి చోదితమయిన కర్మ సూక్ష్మకర్మ అని పిలువబడింది. ఈ సూక్ష్మకర్మ బంధహేతువు కాదు. కొందరు కర్మయోగాన్నే ఇతరయోగాలకంటే ప్రధానమైందని పేర్కొంటారు. మీమాంసకులు కర్మనే దైవంగా ఆరాధిస్తారు. బాలగంగాధర్ తిలక్ మొదలైన ఆధునిక గీతా వ్యాఖ్యాతలు కర్మయోగమే భగవద్గీతలో ప్రధాన ప్రతిపాద్యమని ప్రకటించారు. కాని వేదాంత ప్రక్రియననుసరించి నిష్కామ కర్మయోగం జీవునికి చిత్తశుద్ధి కలిగించడం ద్వారా మోక్షహేతువౌతుందే కాని తనకు తానుగా మోక్షం ఇవ్వజాలదు.

## భక్తిమార్గం :

భక్తిని అనేకులు అనేకవిధాలుగా నిర్వచించారు. స్వాత్మతత్త్వానుసంధానమే భక్తియని వివేకచూడామణి చెబుతుంది. పరతత్త్వమునందు కల అనురక్తే భక్తి అని నారదుడు చెబుతాడు. పురుషార్థ సాధనకనుకూలమైన మార్గాల్లో భక్తిమార్గం అత్యంత సులభమార్గమని యతీంద్రగీత ప్రతిపాదిస్తుంది. సాధకుని ప్రాథమిక యోగ్యతలను గుర్తు చేస్తూ అతని ప్రథమ కర్తవ్యాన్ని శ్రీమలయాళ యతీంద్రగీత ఇలా బోధిస్తుంది.

**ఆ జీవితం త్రయస్సేవ్యా వేదాంతో గురురీశ్వరః ।**
**ఆ ప్రాణం తత్త్వమేతద్ధి విస్మరేన్న హి సాధకః ॥ IV - 47**

ఎంత ఆత్మజ్ఞాని అయినా గురువు, శాస్త్రం, ఈశ్వరుడు ఈ మూడింటిమీద భక్తివిశ్వాసాలు కలిగి వుండాలి. అటువంటి భక్తి మాతృభక్తి అని, పితృభక్తి అని అనేక విధాలుగా వుంటుంది. భక్తి పద్ధతుల్లో దైవభక్తి శ్రేష్ఠమైనది. అటువంటి దైవభక్తి శివభక్తి, విష్ణుభక్తి అని ప్రధానంగా రెండురకాలు. అసలు భక్తి అంటే ఏమిటి? కొంతమంది భగద్విగ్రహాన్ని చక్కగా అలంకరించి, నైవేద్యాదులు సమర్పించడమే భక్తి అనుకుంటారు. ఈ భావన యుక్తమైంది కాదు.

**భజతేఽక్తిని సేవాయాం భక్తిర్నిష్పద్యతే క్రమాత్ ।**
**తతో భగవతస్సేవా భక్తిరిత్యభిధీయతే ॥ XI - 3**

నిర్మల హృదయంతో ఆ భగవంతుని సచ్చిదానంద దివ్య విగ్రహాన్ని మనసులో ధ్యానించడమే భక్తి అని స్వామి అభిప్రాయం.

స్వాత్మని స్వేష్టదైవం హి స్వాత్మానం చేష్టదైవతే ।
అభేద దృష్టి రేషా హి పరాభక్తిరితి స్మృతా ॥ XI - 6

భక్తుడు తన ఇష్టదైవాన్ని తనకంటే అభిన్నంగా చూచే పరిపక్వదశ చాలా శ్రేష్ఠమైనది. ఆ దశనే పరమభక్తి అని అంటారు.

జీవేశ్వర సమైక్యం చ వేదాన్తా ర్థగతం పునః ।
తత్త్వజ్ఞా భక్తిమేవాహు స్సద్యోముక్తిర్యతో ధ్రువమ్ ॥ XI - 7
ఏవమీశం పరం విశ్వే తథా విశ్వం పరేశ్వరే ।
అభేద దర్శనం భక్తిమాహు స్తత్త్వ విదోవరామ్ ॥ XI - 8

ఇదే జీవేశ్వర తాదాత్మ్యమనే భక్తి సిద్ధాంతం. ఇందువల్ల సద్యోముక్తి లభిస్తుంది. చరాచర విశ్వాన్ని పరమభక్తి కలవాడు పరమేశ్వరమయంగా సందర్శిస్తాడు.

భక్తి హీనాని కర్మాణి శ్రద్ధయా చరితాన్యపి ।
వృథా తాన్యవగచ్ఛ త్వం వృష్టిహీనా యథా కృషిః ॥ XI - 10

వరి పైరుకు నీరెలా ముఖ్యమో, సాధకులకు భక్తి అంతముఖ్యం. భక్తిలేని కర్మలు వర్షంలేని వ్యవసాయం లాగా నిరుపయోగా లౌతాయి.

భగవద్విస్మృతేర్హా నిర్విస్మృ తావతి వేదనమ్ ।
భక్తే స్సల్లక్షణం తాత ! పరాయాశ్శృణు మే వచః ॥ XI - 12
యథా భూమి గతా మీనా ఉత్క్షిపన్త స్తపన్తి చ ।
దైవదూరం తథా చేతః పరభక్తేః పదం కిల ॥ XI - 13

ఉత్తమ భక్తుడు భగవంతుణ్ణి ఎప్పుడూ మరవడు. అలా మరవడమే సంభవిస్తే అతడు గట్టున పడిన చేపలాగా తపించిపోతాడు. ఈ విధంగా శ్రీ

మలయాళ యతీంద్రులు కర్మాచరణంతో పవిత్రుడైన వాడు ఉత్తమ భక్తి సంపన్నుడు కావాలని అనేక ప్రమాణాలతో నిరూపించారు.

**జ్ఞాన మార్గం :**

అన్ని యోగాలలో ఫలప్రదమైనది జ్ఞానయోగం. జ్ఞానం వల్ల సకల దోషాలు నశిస్తాయని భగవద్గీత పేర్కొన్నది. ఆర్తుడు మొదలైన నాలుగు రకాల భక్తులను పేర్కొంటూ కృష్ణుడు జ్ఞాని అయిన భక్తునకు తనకు భేదం లేదన్నాడు. హృదయంలోని మలదోషం నిష్కామ కర్మతో తొలగిపోతుంది. విక్షేపదోషం ఉపాసనతో నివృత్తమౌతుంది. ఇక మిగిలింది ఆవరణ దోషమొక్కటే. ఇది జ్ఞానయోగంతో మాత్రమే నశిస్తుంది. 'ప్రజ్ఞానం బ్రహ్మ' ఇత్యాది మహా వాక్యాలను అధికారి అయిన శిష్యుడు, శ్రోత్రియ బ్రహ్మనిష్ఠుడైన గురువునుండి శ్రవణం చేస్తాడు. తర్వాత మనన, నిదిధ్యాసనాదులు ఆచరిస్తాడు. తద్వారా ఆత్మ సాక్షాత్కారం పొందుతాడు. జ్ఞానయోగానికి ఫలమిదే. అందుకే శ్రీ మలయాళ యతీంద్రగీత ఈ జ్ఞాన యోగాన్ని గురించి వివరిస్తూ జ్ఞానయోగం అమృత సముద్రం వంటిదని, బ్రహ్మప్రాప్తినిచ్చే జ్ఞాన యోగం ఇతర యోగాలకంటే సర్వశ్రేష్ఠమని కొనియాడుతుంది.

> జ్ఞాన యోగో హి యోగానాం శ్రేష్ఠో భూమ ఫలప్రదః ।
> జ్ఞాన యోగ స్థిత బ్రహ్మనిష్ఠానాం నిష్కళాత్మనామ్ ॥ XI - 81

బంధహేతువులైన అహంకార మమకారాలు, దేహ ధర్మాలయిన జాతి వర్ణాశ్రమాలు కేవలం మాయా కల్పితాలని, అసద్రూపాలని తెలుసుకొని శాశ్వతానంద దాయకమైన పరబ్రహ్మస్థితి ఒక్కటే సేవ్యమని తెలుసుకోవడం జ్ఞానం. అటువంటి కేవల జ్ఞానం స్థిరంగా నిలబడదు. గనుక దానిని శాశ్వతం చేసుకోవడం కోసం, దృఢం చేసుకోవడం కోసం యోగమార్గంతో కూడిన జ్ఞాన మార్గాన్ని అనుసరించమంటుంది మలయాళ యతీంద్రగీత. అంతేకాకుండా ఇవి రెండూ పరస్పర సహకారకాలని, పక్షికి రెక్కల్లాగా మోక్షాభిలాషికి రెండూ అవసరమేనని చెబుతుంది.

యోగంతో కూడిన జ్ఞానం ప్రకాశించడమారంభం కాగానే, మాయ అనే తమస్సు పటాపంచలై మోక్షమార్గం సుగమ మౌతుందని మలయాళ యతీంద్రగీత నొక్కి చెబుతుంది. మోక్ష స్వరూపాన్ని వివరిస్తూ

> నిష్కామనాఖ్యే సతి మూలబన్ధే
> జ్ఞానాది యోగాన్తర భూమికాభిః ।
> చతుర్భిరేకోత్తర భాగభాగ్భి
> ర్వినిర్మిత స్తిష్ఠతి మోక్ష సౌధః ॥ XI - 23

మోక్షమనే ఒక మేడకి కర్మ, భక్తి, యోగ, జ్ఞానాలనే నాలుగు అంతస్తు లుంటాయి. మొదటి అంతస్తు నిర్మించకుండా రెండవఅంతస్తు నిర్మించలేము. కర్మమార్గాన్న నుసరించకుండా, భక్తిమార్గాన్ని చేరలేము. భక్తి లేకుండా యోగం కుదరదు. కర్మ, భక్తి, యోగాలు లేకుండా జ్ఞానం సిద్ధించదు. కనుక స్థిరమైన మోక్ష సౌధానికి ఈ మార్గాలన్నీ అవశ్యం అనుసరణీయాలని సిద్ధాంతీకరిస్తుంది శ్రీగీత.

**ఆశ్రమ వ్యవస్థ :**

సనాతన హిందూ ధర్మంలో వర్ణాశ్రమాలు చాలా ప్రధానమైనవి. హిందూమతంలోని వర్ణవ్య వస్థను ఈనాడు చాలామంది అంగీకరించరు. కానీ ఆశ్రమ వ్యవస్థపై ఎవరికీ వ్యతిరేకత లేదు.

> **చతురాశ్రమ ధర్మాణాం త్యాగాద్ధేతోశ్చ మానవాః ।**
> **చతుష్ప్రాజ్జన్తు తుల్యా హి జాతాస్తే కలిచోదితాః ॥ XI - 61**

ప్రజలు పశుతుల్యులుగా అవడానికి కారణం ఆయా ఆశ్రమ ధర్మాలను పరిత్యజించడమే అని స్వామి చెప్పారు. ఆశ్రమ వ్యవస్థను గురించి శ్రీమలయాళ యతీంద్రుల అభిప్రాయాలను ఇక్కడ పరిశీలిద్దాం.

బ్రహ్మచర్యం, గార్హస్థ్యం, వానప్రస్థం, సన్న్యాసం అనేవి నాలుగాశ్రమాలు. వివాహానికి పూర్వదశ బ్రహ్మచర్యమని, వైవాహిక జీవితం గృహస్థమని చెప్ప బడు తున్నవి. ఏబది లేక అరవదేండ్లు దాటిన తర్వాత గృహస్థుడు తన బాధ్యతల

నన్నింటిని తన సంతతికి అప్పజెప్పి, ధర్మపత్నితో కలిసిగాని, లేదా ఒంటరిగా గాని ఏ వనంలోనో, ఆశ్రమంలోనో ముని వృత్తితో గడపటాన్ని వానప్రస్థం అంటారు. నాల్గవది సన్న్యాసాశ్రమం. సర్వసంగ పరిత్యాగం చేసి కేవల బ్రహ్మనిష్ఠుడై వుండే వాడు సన్న్యాసి.

ఈ నాలుగాశ్రమాల గురించి ఆయా ఆశ్రమస్థులు పాటించవలసిన విధులను గురించి, వాటి ప్రయోజనాలను గురించి శ్రీమలయాళ యతీంద్రులు తమ గీతలో అనేక విషయాలు ప్రతిపాదించారు.

## బ్రహ్మచర్యం :

> ఆర్యైర్మునిభిరాఖ్యాతం బ్రహ్మచర్యం చతుర్విధమ్ ।
> పృథక్నైష్ఠిక గార్హస్థ్య విధురాఖణ్డ నామభిః ॥ XI - 5

ఆశ్రమాల్లో మొదటిది బ్రహ్మచర్యం. ఇది నైష్ఠికం గార్హస్థ్యం, విధురం, అఖండం అని నాలుగు విధాలు. మరణాంతం వరకు స్త్రీ సంపర్కం లేకుండా వుండడం నైష్ఠికమనీ, ఋతుకాలమందు మాత్రమే స్వభార్యా సంపర్కం కలిగి వుండటం గార్హస్థ్యమని చెప్పబడింది. దంపతుల పరస్పర వియోగం వల్లగానీ, లేక ఇద్దరూ బ్రహ్మనిష్ఠాపరులయి అవలంబించే బ్రహ్మచర్యం విధురం అని పిలువబడుతుంది.

> నిత్యం బ్రహ్మ విహారిత్వ మఖణ్డం కథ్యతే బుధైః ।
> సర్వేష్వేతత్సమీచీనం వేదసమ్మత మిత్యపి ॥ III - 9

నిరంతరం బ్రహ్మవిచారంలో మునిగివుండడమన్నది అఖండ బ్రహ్మచర్యము అనబడుతుంది. అటువంటి బ్రహ్మచర్యమే శ్రేష్ఠాతిశ్రేష్ఠమని స్వామి వారి అభిప్రాయం.

> తైలనాశే యథా దీపః క్షిప్రమేవ వినశ్యతి ।
> బ్రహ్మచర్య వినాశేపి క్షీణ ప్రజ్ఞో జనస్తథా ॥ III - 28

బ్రహ్మచర్యం లేనివాడు నూనె లేని దీపం లాగా క్షీణిస్తాడంటుంది

యతీంద్రగీత. బ్రహ్మచర్యాశ్రమానికి మనం తినే ఆహారానికి సంబంధముంది. ఆహారశుద్ధి లేకపోతే ఆత్మశుద్ధి కలుగదు. అందుచేత బ్రహ్మచారి ఆహారవిషయంలో చాలా జాగరూకుడై వుండాలని స్వాముల వారు వక్కాణించారు.

తస్మాదాహార శుద్ధిశ్చ మనసశ్శుద్ధి కారణమ్ ।
బ్రహ్మచర్యం సమిచ్ఛుద్భి రాహారావాస శుద్ధతామ్ ॥ III - 41

## గార్హస్థ్యం :

శ్రీస్వాములవారు నిష్ఠాగరిష్ఠులైన సన్న్యాసుల్లాగానే స్వధర్మ నిరతులైన గృహస్థులు కూడా తప్పక ముక్తికి అర్హులని, అంతేకాక-

యథా వాయుం సమాశ్రిత్య వర్తన్తే సర్వజన్తవః ।
తథా గృహస్థ మాశ్రిత్య వర్తన్తే సర్వ ఆశ్రమాః ॥ I - 6

ప్రాణవాయువు నాశ్రయించి ప్రాణులు బ్రతికినట్లే గృహస్థాశ్రమాన్నాశ్రయించి తక్కిన వారందరూ బ్రతుకుతున్నారని స్వాములవారు ఉట్టంకించారు. అగ్నికి స్వాహాదేవిలాగా గృహస్థుడైన వానికి ధర్మపత్ని చాలా ముఖ్యమైనది. సతీపతులిద్దరూ దృఢ సంకల్పంతో, మోక్షాపేక్షతో ప్రయత్నించడం ఉచితమని స్వామి చెప్పారు.

## వానప్రస్థం మరియు సన్న్యాసం :

అధునిక కాలంలో వానప్రస్థమప్రస్తుతమనిపించి కాబోలు స్వాములవారు ఆ ఆశ్రమాన్ని వదలి, చివరి ఆశ్రమాన్ని గురించి ఇలా చెబుతారు. మోక్షాపేక్షతో సమస్తాన్ని వదలివేసి నిస్సంగుడు కావడం సన్న్యాసం. అటువంటి సన్న్యాసం రెండు రకాలు. క్రమ సన్న్యాసం, క్రమభిన్న సన్న్యాసం. బ్రహ్మచర్యాది మూడాశ్రమాలని పూర్తిచేసుకొని ఆపైన సన్న్యసించడం క్రమ సన్న్యాసం. 'యదహరేవ విరజేత్ తదహరేవ ప్రవ్రజేత్' అన్న వచనానుసారం ఆశ్రమాల క్రమాన్ని పాటించకుండా దృఢదీక్షకలిగినపుడు సన్న్యసించడం క్రమభిన్న సన్న్యాసం. ఉదా : శంకరాచార్యులు, వివేకానందులు, మలయాళ యతీంద్రుల వంటివారు.

వైరాగ్యంతో బంధుమిత్రాదులను పరిత్యజించి శాస్త్రరీత్యా సన్న్యసించడం దేహసన్న్యాసం. మానసిక సంకల్పాలను పూర్తిగా త్యజించి, చిత్తాన్ని వశంలో ఉంచుకోవడం మానసిక సన్న్యాసం. బంధాలన్నిటినీ వదలుకొని నిరంతర బ్రహ్మభావనలో వుండడం ఆత్మసన్న్యాసం.

ఆశ్రమాదులు దేహధర్మాలని, అవి ముక్తికి కారణాలు కావని, ఆచారంతో కూడిన జ్ఞాన నిష్ఠే ముక్తికి కారణమని స్వామి అభిప్రాయం.

జాతివర్ణాశ్రమాస్సర్వే దేహధర్మ ఇతీరితాః ।
నహ్యాత్మ ధర్మాస్తే చ స్యుః కేవలం బన్ధహేతవః ॥ I -33
నాశ్రమం కారణం ముక్తేర్వనాని గృహాణి చ ।
తథైవ సర్వకర్మాణి శుద్ధిరేవ హి కారణమ్ ॥ I - 35

వర్ణాశ్రమాలు దేహానికి సంబంధించినవే కాని, ఆత్మకు సంబంధించినవి కావు. పైగా అవి బంధానికి హేతువులౌతాయి. కేవలం ఆత్మశుద్ధి మాత్రమే మోక్షానికి కారణం. అందువల్ల ఆత్మశుద్ధి కలవారెవరైనా సరే ముక్తికి యోగ్యులౌతారని శ్రీమలయాళ యతీంద్రగీత నిర్ద్వంద్వంగా చాటింది.

**నిద్ర కోసము పరుండు వాడు సంసారి,**
**నిద్ర వచ్చినప్పుడు పరుండువాడు సన్న్యాసి.**

**జ్ఞానికి పాపము లేదు, కాని పాపికి జ్ఞానము**
**కలుగదు. భావశుద్ధియే జ్ఞాన సిద్ధి.**

శ్రీ మలయాళ స్వామి

చతుర్థాధ్యాయం

# శ్రీమలయాళ యతీంద్రగీత - వేదాంత తత్త్వం

శ్రుతి స్మృత్యాదుల్లో ప్రతిపాదించబడిన వేదాంత మతాన్ని, సామాన్య మానవునికి అందుబాటులోనికి తేవడమే శ్రీమలయాళ యతీంద్రగీత పరమలక్ష్యం. వేదాంత తత్త్వంలో భిన్న సిద్ధాంతాలు చోటు చేసుకొన్నాయి. యతీంద్రగీత ప్రధానంగా అద్వైత సిద్ధాంతాన్ని ప్రతిపాదిస్తూనే, ఇతర సిద్ధాంతాలని కూడా పరిచయం చేస్తుంది. శంకరుల అద్వైత మత తత్త్వాన్ని ముందుగా పరిచయం చేసి, తరువాత మలయాళ యతీంద్రగీతలో అద్వైత భావనల్ని పరిశీలిద్దాం.

## అద్వైతం :

అద్వైతం అంటే ద్వైతం కానిదని అర్థం. అద్వైత భావాలను సమీకరించి సిద్ధాంత రూపంలో మొట్టమొదట వెల్లడించింది గౌడపాదాచార్యుల వారు. ఆయన శిష్యుడు గోవింద భగవత్పాదులు. గోవింద భగవత్పాదుల శిష్యులే శ్రీశంకర భగవత్పాదాచార్యుల వారు. శ్రీమలయాళ యతీంద్రులు శంకరాచార్యులు ప్రచారం చేసిన అద్వైత సంప్రదాయమే తమదని స్పష్టంగా పేర్కొన్నారు.

అద్వైతం బ్రహ్మమొక్కటే అని, 'ఏకమేవా ద్వితీయం' అని శ్రుతి మాటను విశ్వసిస్తుంది. బ్రహ్మం నిర్విశేషం. అందులో సజాతీయ, విజాతీయ స్వగత భేదాల్లేవు. ఆత్మ, పరమాత్మలకు భేదమన్నది లేదు. పైకి కనిపించే భేదం కల్పితం మాత్రమే. ఈ జగత్తు సత్తా లేక అ సత్తా అంటే వున్నదా లేనిదా? అనే ప్రశ్నకు అది వున్నదీ కాదు లేనిదీ కాదు. కంటికి కనిపిస్తున్నది కాబట్టి గగన కుసుమం లాగా లేనిదీ కాదు. శాశ్వతంగా వుండదు కాబట్టి అది ఆత్మవలె సత్తుకాదు. అటు సత్తూ కాక, ఇటు అసత్తూకాక వుండే పదార్థాన్ని అద్వైత వేదాంతంలో మిథ్య అంటారు. అందుకే ఈ జగత్తు మిథ్య అని అద్వైతులు చెబుతారు. దాన్నే అనిర్వచనీయమని కూడ అంటారు.

> సన్నాప్యసన్నాప్యుభయాత్మికా నో
> భిన్నాప్యభిన్నాప్యు భయాత్మికా నో ।

సాంగాప్యనంగాప్యు భయాత్మికా నో
మహాద్భుతా ఽనిర్వచనీయ రూపా ॥

సర్వకాల సర్వావస్థల్లో మార్పులేకుండా ఏది వుంటుందో అది సత్యం. త్రికాలా బాధితమైనదే సత్యం. ఆ విధంగా వుండేది బ్రహ్మమొక్కటే. అందుకే అది సత్యం. 'సత్యం జ్ఞాన మనంతం బ్రహ్మ' అని శ్రుతి. అందువల్ల బ్రహ్మసత్యమని, జగత్తు మిథ్య అని తేలింది. ఇక జీవుడంటే ఎవరు? అతడు బ్రహ్మకంటే వేరు కాడు. అజ్ఞానంతో వున్నంత వరకు జీవుడు. అజ్ఞానం తొలగిపోతే దేవుడు అంటే బ్రహ్మమనే అర్థం. అందుకే శంకరులు 'బ్రహ్మసత్యం జగన్మిథ్యా జీవో బ్రహ్మైవ నాపరః' అని చెప్పారు.

ఈ జగత్తుకు బ్రహ్మమే మూలం. ఇంద్రజాలం చేసేవాడు ఒక శక్తితో కొన్ని పదార్థాలను చూపిస్తాడు. ఆ పదార్థాలన్నీ అసత్తులే. అసత్తులై కూడా సత్తులుగా తోచడానికి కారణం ఇంద్రజాలం. అలాగే ఉనికిలేని ఈ ప్రపంచం మాయాశక్తి వల్ల వున్నదిగా తోస్తున్నది. మాయ తొలగిపోతే జగత్తు ఉనికి లేనిదై పోతుంది. మసక చీకటిలో ఒకడు త్రాడును పాము అనుకుంటాడు. భయపడతాడు. అతనికి ముచ్చెమటలు పోస్తాయి. తీరా పరిశీలించి చూస్తే అది పాము కాదు త్రాడు. రజ్జువును సర్పంగా భ్రమించటం జరిగింది. భ్రాంతి తొలగిపోతే అక్కడ వున్నది త్రాడే అని తెలుస్తుంది. భ్రాంతికి ముందు, భ్రాంతి కాలంలో, భ్రాంతి తొలగిన తర్వాత వున్నది త్రాడు ఒక్కటే. భ్రాంతి వల్ల తోచిన సర్పం భ్రాంతితోపాటే పోయింది. అలాగే అజ్ఞాన మున్నంతవరకే జగత్తు జగత్తుగా తోస్తుంది. అది తొలగిపోతే అంతా బ్రహ్మమే. అందుకే శ్రుతి 'సర్వం ఖల్విదం బ్రహ్మ నేహ నా నాస్తి కించన' అని చెప్పింది

అస్తి భాతి ప్రియం రూపం నామ చేత్యంశ పంచకమ్ ।
ఆద్యత్రయం బ్రహ్మరూపం జగద్రూపం తతో ద్వయమ్ ॥

ప్రపంచంలోని పదార్థాలన్నిటిలోనూ అస్తి, భాతి, ప్రియం, నామం, రూపం అనే అయిదు అంశాలున్నాయి. ఇందులో మొదటి మూడు అంశాలు పరబ్రహ్మానికి చెందుతాయి. చివరి రెండంశాలు జగత్తుకు చెందుతాయి.

ఉదా:- ఒక ఘటముంది. అందులో ఈ అయిదు అంశాలున్నాయి. (1) అస్తి - కుండ అనే పదార్థం వుంది. (2) భాతి - కుండ అనే పదార్థం తెలియవస్తున్నది. (3) ప్రియం- కుండ వల్ల మనకు ఉపయోగముంది కాబట్టి మనం దానిని ప్రేమిస్తున్నాం. కుండ మనకు ప్రియమైనది. ఈ వుండడం (అస్తి), తెలియడం (భాతి) ప్రియం కావడం (ప్రియం) అనేవే మరొక విధంగా చెబితే సత్, చిత్, ఆనందాలవుతాయి. (4) నామం - ఒక పదార్థాన్ని గుర్తించడం కోసం మనం కల్పించుకొన్న పేరు. (5) రూపం - ప్రతి వస్తువుకు వుండే ఆకారవిశేషం. ఈ నామ రూపాలు కేవలం పదార్థానికి మాత్రమే చెందుతాయి. అవి బ్రహ్మకు సంబంధించినవి కావు. అవి కేవలం జగత్తుకు సంబంధించినవి.

ఘటానికి వుండే నామ రూపాలు పటానికి వుండవు. అందుకే ఈ నామరూపాలు, వ్యభిచార శీలాలు, అస్తి, భాతి, ప్రియమనేవి అన్నింట్లో వుంటాయి. అద్వైత వేదాంతం ప్రకారం ఈ మూడింటి లక్షణాలు గల సచ్చిదానంద స్వరూపమైన బ్రహ్మ మొక్కటే సత్యమని, నామరూపాత్మకమైన జగత్తు మిథ్య అని గ్రహించాలి.

'ప్రజ్ఞానంబ్రహ్మ' అనే మహావాక్యం ఋగ్వేదానికి చెందింది. 'అహం బ్రహ్మాస్మి' అనే మహావాక్యం యజుర్వేదానికి చెందింది. 'తత్త్వమసి' అనేది సామవేద సంబంధమైంది. 'అయమాత్మా బ్రహ్మ' అనేది అథర్వణ వేదానికి సంబంధించింది. ఉద్దాలక మహర్షి శ్వేతకేతువుకు 'తత్త్వమసి' అని ఉపదేశిస్తాడు. ఈ వాక్యం జీవునికి, ఈశ్వరునికి అభేదాన్ని బోధిస్తున్నదని అద్వైత వేదాంతం సిద్ధాంతీకరిస్తుంది. ఈ వాక్యంలో తత్- త్వం- అసి అని మూడు పదాలున్నాయి. 'తత్' పదానికి వాచ్యార్థం ఈశ్వరుడు లక్ష్యార్థం పరబ్రహ్మం. 'త్వం' పదానికి వాచ్యార్థం జీవుడు. లక్ష్యార్థం కూటస్థుడు. 'అసి' పదం జీవబ్రహ్మల ఏకత్వాన్నే ప్రతిపాదిస్తుంది. 'జహదజహల్లక్షణా' (భాగ త్యాగ లక్షణ) వృత్తి ద్వారా ఈ ఐక్యం సాధించ బడుతుంది.

ఘటమనే ఉపాధిలో ఉండే ఆకాశాన్ని ఘటాకాశమంటారు. మఠమనే ఉపాధిలో వుండే ఆకాశాన్ని మఠాకాశం అంటారు. ఆ ఉపాధులున్నంత వరకు ఘట, మఠాకాశాలకు ఏకత్వం కుదరదు. ఘటం నశిస్తే అందులో ఆకాశం

మిగుల్తుంది. మఠం నశిస్తే అందులో మిగిలేది కూడా ఆకాశమే. ఇవి రెండూ ఒకటే. అందువల్ల ఉపాధులను వదిలిపెడితే జీవునిలోను, దేవునిలోను వున్న చైతన్యం ఒకటే. జీవత్వమనే ఉపాధి, ఈశ్వరత్వమనే ఉపాధి తొలిగి పోయినపుడు రెండింటిలోనూ మిగిలేది చైతన్యమొక్కటే. ఇది భాగత్యాగ లక్షణతో సాధ్యమౌతుంది. ఈ విధంగా అద్వైత సిద్ధాంతం జీవునికి, ఈశ్వరునికి ఏకత్వాన్ని సాధించింది. గౌడపాదులు, గోవింద భగవత్పాదులు, శంకర భగవత్పాదులు ఈ సిద్ధాంతాన్నే అనుసరించి అద్వైతమత ప్రతిపాదన చేశారు. శంకరాచార్యులు ప్రస్థానత్రయ భాష్యంలో ఈ అద్వైత మత సిద్ధాంతాన్నే ధ్రువీకరించారు.

ఇటువంటి సంప్రదాయానికి చెందినవారే శ్రీమలయాళ స్వాములవారు. వీరు తమ మలయాళ యతీంద్రగీతలో పూర్వాచార్యుల గ్రంథాల్లోని అంశాలనే సామాన్య పాఠకునికి అందుబాటులో వుండేలా సరళంగా, ఆధునికమైన అనేక ఉదాహరణలతో అద్వైత సిద్ధాంతపరంగా బోధించారు.

## బ్రహ్మ :

సత్, చిత్, ఆనందం అనే మూడు గుణాలు కలిగింది బ్రహ్మ. ఆ బ్రహ్మనే 'సత్యం జ్ఞానమనంతం బ్రహ్మ' అని శ్రుతులు పేర్కొంటాయి. చిదానంద రూపంతో స్వయంగా ప్రకాశించేది బ్రహ్మ.

'చిదానన్దైక రూపత్వాద్దీప్యతే స్వయమేవ తత్' V - 57

దీనికి నామరూపాలు లేవు. శబ్దానికి కూడా అందనిది అవ్యక్త బ్రహ్మస్థితి. అటువంటి బ్రహ్మకు వాచకరూపం ప్రణవం. అదే బ్రహ్మకు శరీరం. ప్రణవమే ఓంకారం. అదే పరమార్థ సత్యం. పరమపదం.

గుణరహితుడైన బ్రహ్మ నిర్గుణుడు, నిర్విశేషుడు అని పిలువబడితే, జగత్సృష్టికి కారకుడైన బ్రహ్మ సగుణుడు, ఈశ్వరుడు, పరమాత్మ అని పిలువబడతాడు. ఈ ఈశ్వరుడు సృష్టించిన జగత్తు, అందులోని జీవులు అందరూ బ్రహ్మస్వరూపులే. ఇది స్వతః ప్రమాణం. దీనికి మరో ప్రమాణమక్కరలేదు. అందుకే 'బ్రహ్మైవేదం సర్వం' అని శ్రుతులు నొక్కి చెబుతున్నాయి. జాగ్రత్, స్వప్నం, సుషుప్తి అనే మూడు అవస్థల్లోనూ ప్రకాశించేది బ్రహ్మ.

## జగత్తు :

ఈశ్వరుని చేత సృష్టించబడిన ఈ జగత్తు అతని రూపమే అవుతుంది. జగత్తు బ్రహ్మకన్న భిన్నమైనది కాదు. ఆ విషయాన్నే కార్యకారణమనే సంబంధం ద్వారా అనుమాన ప్రమాణంచేత స్వాములవారు ఇలా చెప్తారు.

సృష్టి, స్థితి, లయాలకు కారణభూతమైన మహాశక్తి గలవాడే ఈశ్వరుడు. ఈ జగత్తు ఆయన సంకల్ప ఫలం. కార్య రూపమైన జగత్తును చూసి, కారణరూపుడైన పరమాత్మను తెలుసుకోవాలి. చెట్టుకు విత్తువలె, కుండకు మట్టివలె కార్యకారణ సంబంధం చేత ఈ జగత్తు పరమేశ్వర నిర్మితమని గ్రహించవచ్చును.

> జగజ్జన్మాది హేతుత్వం దేవస్యైవ విజానతః ।
> దేవాస్తిత్వం బ్రువాణాం స్తాన్దేవా నాహుర్మనీషిణః ॥ XIV - 57

ఈశ్వర సంబంధం లేకనే జగత్తు తనకు తానే రూపు దాల్చవచ్చును గదా! అనే అభిప్రాయాన్ని ఖండిస్తూ, ఒక జడవస్తువు మరొక జడవస్తువును సృష్టించలేదు. జడపదార్థంలో కదలిక రావడానికి చైతన్యం కలిగిన మరొక వస్తువు అవసరం కనుక ఈ జడరూపమైన జగత్తుకు చైతన్యమనే శక్తి భగవంతుడే.

> స్వభావస్య జడత్వేన జడం స్రష్టుమశక్తతా ।
> చేతనాజ్జడ సృష్టిర్హి దృష్టా తశ్చేతనస్యసా ॥ XIV - 15

ఆ చైతన్య శక్తే సృష్టికి కారణమైనపుడు ఈశ్వరుడని పిలువబడతాడు. నిత్యజీవితంలో కూడా ఒక యంత్రం తనకు తానుగా తయారు కాదు గదా! ఆ యంత్రాన్ని ఎవడో ఒకడు తప్పకుండా తయారు చేసి వుండాలి. తయారుచేసినవాడు మనకు కనిపించక పోయినా, అతని ఉనికి మాత్రం సత్యం.

> యన్త్ర్యభావే క్షితౌ యన్త్రం నిష్పత్తుం నైవశక్యతే ।
> యన్త్రం దృష్ట్వా న దృష్టోపి యన్త్రీ తస్మాత్ప్ర కల్ప్యతే ॥ XIV - 17

అలాగే కనిపించే ఈ జగత్తుని చూచి, కనిపించని ఆ పరమాత్మని అనుమాన ప్రమాణంతో ఊహించి తెలుసుకోవాలి అంటారు స్వాములవారు.

జగత్తులోని పంచ భూతాలు, సూర్యచంద్రులు ఏదో ఒక నిర్ణయానికి లొంగి, లేదా ఒక చైతన్య శక్తిని ఆధారం చేసుకొని తిరుగుతున్నట్టు గోచరిస్తాయి. ఏమిటా చైతన్యశక్తి? అదే బ్రహ్మ. అతనికి లొంగి, అతని ఆజ్ఞానుసారం సూర్యచంద్రాదులు సంచరిస్తున్నారని శ్రుతివాక్యం చెబుతుంది. 'భీషా ఽ స్మాత్ వాతః పవతే భీషోదేతి సూర్యః' ఒక జడ పదార్థం మరొక జడ పదార్థాన్ని సృష్టించలేక పోవచ్చు. అయితే చైతన్యవంతుడైన జీవుడు సృష్టికి కారకుడు ఎందుకు కాడు? అనే సందేహాన్ని స్వామి ఇలా తొలగిస్తారు.

చైతన్యపూరితుడైన జీవుడు సర్వజ్ఞుడు కాడు. సర్వజ్ఞత్వం, సర్వవ్యాపకత్వం, అనే విశేష గుణాలు లేని మానవుడు జగత్సృష్టికి కర్త ఎలా అవుతాడు? సర్వజ్ఞత్వం, సర్వవ్యాపకత్వం, సర్వశక్తిమత్త్వమనే గుణాలు పరమేశ్వరునిలో మాత్రమే ఉన్నాయి. సృష్టికి అవసరమైన ప్రేరణ పరమాత్మ సంకల్ప ఫలితమే. ఈ జగత్తు పారమార్థిక దృష్టితో, కార్యకారణ అభేదం ద్వారా చూచినపుడు పరమాత్మకంటె భిన్నం కాదని తెలుతున్నది. ఆత్మకన్న భిన్నమైన మరోపదార్థం లేదు. సర్వత్రా వ్యాపించి, సర్వ ప్రపంచానికి ఆధారమైనది పరబ్రహ్మ. అందుకే బ్రహ్మకన్నా వేరైనది లేనే లేదని శ్రుతి వాక్యం ఇలా చెబుతుంది. 'ఏకమే వా ద్వయం బ్రహ్మ నేహనా నాస్తి కించన'.

పంచ భూతాత్మకమైన ఈ జగత్తు అశాశ్వతమైనది. పరిణామాన్ని పొందే గుణం కలది. దీనికి ఆద్యంతాలు వున్నాయి. అందువల్ల శాశ్వతమైన పరమాత్మలో నుంచి పుట్టినటువంటి అశాశ్వతమైన జగత్తు 'సముద్రంలోని నీరు ఆవిరిగా మారి మేఘమై వర్షించి మళ్ళీ సముద్రంలోనే కలిసినట్టు' పరమాత్మలోనే లయమౌతుంది.

## జీవుడు :

ఈశ్వర నిర్మితమైన జగత్తు జడపదార్థమైతే జీవుడు చైతన్య స్వరూపుడు. కార్యకారణ సంబంధము ననుసరించి జీవ, బ్రహ్మలు ఒక్కటే అవుతున్నారు. కనుక జీవులందరూ బ్రహ్మరూపులే అని తాత్పర్యం. ఇద్దరూ ఒకటే అయితే జీవుడు, దేవుడు అనే వ్యవహారం అసంగతం కదా! అందువల్ల జీవుని యొక్క స్వరూపాన్ని

తెలియజేయడం ద్వారా జీవుడు దేవునికన్నా ఎలా భిన్నుడో స్వామి చెబుతారు. పాశం చేత బంధించబడిన శుద్ధాత్మ 'జీవుడు' అని పిలువబడుతున్నాడు. ఈ పాశము మోహ, అజ్ఞాన, అహంకారాలతో కూడినటువంటిది. పంజరమున బంధించిన చిలుకలాగా, వలలో పడిన చేపలాగా జీవుడు మోహపాశంలో బంధించబడినాడు. కనుక అజ్ఞాన మాలిన్యం చేత జీవుడు దేవుని కన్నా భిన్నమైన వాడు. మాయా ప్రభావానికి లోబడి సంసార బంధంలో చిక్కిన పరమాత్మే జీవుడౌతున్నాడు.

## మాయ :

సచ్చిదానంద స్వరూపుడైన పరమాత్మ పాశబద్ధుడై ఎందుకు జీవుడౌతున్నాడు? సంసార బంధంలో ఎందుకు తగులుకుంటున్నాడు? దానికి కారణమేమిటి? అనే సందేహాలకు స్వామి ఇలా చెప్తారు.

ప్రతి జీవునిలోను దివ్యమైన ఆత్మశక్తి వుంటుంది. అజ్ఞానం ఆవరించిన జీవుడు ఆత్మశక్తిని తెలుసుకోవటం లేదు. దానికి కారణం మాయ. ఈ మాయకి ప్రకృతి అని కూడా పేరు. ఇది ఈశ్వరుని అధీనంలో వుంటుంది. అందుకే ఈశ్వరుని 'మాయి' అని శ్వేతాశ్వేతరోపనిషత్తు పేర్కొంటుంది. ఈ మాయా ప్రభావానికి లోనై, జీవుడు ప్రమాదానికి గురియై సంసారబంధంలో చిక్కుకుంటున్నాడు. ఈ మాయ అనే ముసుగును తొలగించుకొని సాధన ద్వారా, తన సహజ తత్త్వాన్ని లేదా సహజ స్వరూపాన్ని తెలుసుకున్న జీవుడు పాశముక్తుడై మరలా పరబ్రహ్మ స్వరూపుడే అవుతాడు. కనుక ప్రకృతిని నశింపజేసి ఈశ్వరత్వాన్ని పొందడానికి జీవుడు సదా యత్నించాలి.

## ముక్తి :

సాధన సంపత్తి ద్వారా తత్త్వ జ్ఞానాన్ని పొంది, ముక్తుడైన జీవుడు పొందే స్థితి ఎటువంటిది? దాని స్వరూపమేమిటో స్వామి ఇలా అంటారు.

బంధం నుండి వెలువడి తాను పరమాత్మ కన్నా అభిన్నుడు అను భావనను స్థిరంగా కలిగిన జీవుడు ముక్తిని పొందుతాడు. బంధ నాశనమే ముక్తి. నేను ముక్తుడను అన్న భావమే ముక్తి. సంకల్పరహితమూ, వాసనా రహితమూ అయిన చిత్త స్థితియే

ముక్తి. అహంభావ నాశనమే మోక్షానికి మార్గము. సచ్చిదానంద రూపుడైన పరబ్రహ్మను నేనే అను భావన దృఢంగా కలగడమే ముక్తి. తిరిగిరాని స్థితి లేదా జన్మము లేని స్థితియే మోక్షం. అటువంటి ముక్తి స్థితి అఖండము, శివత్వము, బ్రహ్మత్వము, విష్ణుత్వం, స్వర్గం, కైవల్యం, అర్హత్ అని చాలా పేర్లతో పిలువ బడుతున్నది.

ఇటువంటి ముక్తి రెండు విధాలు, సదేహముక్తి, విదేహముక్తి. పరవిద్య ద్వారా మాయ అనే ముసుగును తొలగించు కొన్నవాడు జీవించి ఉండగా ముక్తిని పొందుతున్నాడు. దీనినే సదేహముక్తి లేదా జీవన్ముక్తి అని పిలుస్తారు. దేహమున్నంతవరకు సాధన సంపత్తి ద్వారా చిత్తశుద్ధిని సాధించి, మాయావరణం నుండి వెలువడి దేహ పతనానంతరం పొందు ముక్తిని విదేహముక్తి అని అంటారు. జీవన్ముక్తుడు తన ఆత్మలో పరమాత్మను చూస్తూ సదా బ్రహ్మంలోనే రమిస్తాడు. బ్రహ్మాత్మ భావన కలిగిన వెంటనే హృదయ గ్రంథులు విడిపోయి, సంశయాలు నశించి కర్మలన్నీ భస్మమౌతాయి. అటువంటి వాడు కర్మచేసినా, చేయకపోయినా కర్మఫలిత మేమాత్రం అంటదు.

వర్ణాశ్రమాదులు, లింగ, జాతి భేదాలు ముక్తికి హేతువులు కావు. ఒక్క ఆత్మశుద్ధి మాత్రమే మోక్షానికి కారణం. జ్ఞానానికి యోగం కారణం, యోగానికి భక్తి కారణం, భక్తికి కర్మ కారణం. కనుక మోక్షమనే సౌధం నాలుగు స్తంభాలపై ఆధారపడి వుంది. ఈ నాలుగు మార్గాలూ పరస్పర సహకారంతో మోక్షప్రాప్తికి సహకరిస్తాయని, జ్ఞానం మాత్రమే ప్రధాన సాధనమని స్వాములవారి అభిప్రాయం.

## విశిష్టాద్వైతం :

శ్రీమలయాళ స్వాములవారు సిద్ధాంతపరంగా అద్వైత మతానుయాయులే అయినా, ఇతరమత సంప్రదాయాల పట్ల వారికెటువంటి ద్వేషభావంకాని, నిర్లక్ష్యం కాని లేదు. అద్వైత బ్రహ్మ స్థితిని అందుకోవడానికి అద్వైతమతంలో పేర్కొన్న మార్గాలకి అవిరుద్ధంగా ఇతర మతానుయాయులు సూచించిన మార్గాలను గాని, సాధనలను కాని వారెన్నడు తిరస్కరించలేదు. పైగా

అవసరమైనపుడు వారి భావనలని యథాతథంగా అనుసరించాలని ప్రబోధించారు కూడ. భారతీయ, భారతీయేతర మత సంప్రదాయాలలో వారికి అత్యంత ప్రీతిపాత్రమైన భావాలని స్వామి తమ యతీంద్రగీతలో అక్కడక్కడా ఉదహరించారు. భారతీయ తాత్త్విక దర్శనాలలో స్వాములవారికి ఆదరణీయాలైన భావనల్ని ఈ విధంగా సంగ్రహించవచ్చు.

అద్వైతానంతర కాలంలో శ్రీరామానుజాచార్యులచేత ప్రతిపాదించబడిన మతం 'విశిష్టాద్వైతం' సగుణ పరిపూర్ణుడైన మహావిష్ణువే పరబ్రహ్మ స్వరూపమని, అతని వాసం వైకుంఠమని, కర్మఫల నాశనానికి, వైకుంఠప్రాప్తికి భక్తియే ప్రధానమని వారిమతం. నవ విధ భక్తితో శ్రీమహావిష్ణువును అర్చించి, ప్రపత్తి, శరణాగతి అని పిలవబడే మార్గాలద్వారానే ముక్తి సాధ్యమని వారి అభిమతం. అద్వైత మతపరంగా జ్ఞానమే మోక్షానికి పరమ సాధనమని నమ్మినా, శ్రీస్వాములవారు భక్తిమార్గ ప్రాధాన్యాన్ని అనేకమార్లు ప్రస్తుతించారు. ఈ భక్తి భావాన్ని తెలియజేయడానికి యతీంద్రగీతలో 11వ అధ్యాయాన్ని 'భక్తి ప్రభావయోగం'గా పేర్కొన్నారు. మాతృభక్తి, పితృభక్తి వంటి భక్తి ప్రకారాల్లో దైవభక్తి ఉత్తమమైనదని వారి అభిప్రాయం. భక్తిలేని కర్మలు వర్షంలేని కృషి వంటివి. అవిచ్ఛిన్నమైన తైల ధారవలె నిరంతర భగవత్స్మరణమే భక్తియని రామానుజులు చెప్పిన భక్తి లక్షణాలను ఇలా పేర్కొన్నారు.

మనో వాక్కాయాలతో బాహ్య క్రియలను మాని, ఆయా ఇంద్రియాలను అంతర్ముఖం చేసుకొని ఆత్మైక చింతన చేయడమే పరమ భక్తి. ఎవడు స్వయంగా ఉత్తమ భక్తుడైనా, తనను భక్తి హీనుడిగా భావిస్తున్నాడో, సమస్త సృష్టిని, ప్రాణాలని భగవద్రూపాలుగా భావించి, వాటి సేవనే భగవంతుని సేవగా భావిస్తున్నాడో, ఇతర పేర్లతో భగవంతుని కీర్తించే భక్తులు ఎదురైనపుడు వారి సమక్షంలో, భగవంతుని సన్నిధిలో తను పొందే తన్మయ భావాన్ని హర్షాతిరేకాన్ని అనుభవిస్తున్నాడో అటువంటివాడే పరమ భక్తుడు.

మోక్షస్థితిలో శంకర సంప్రదాయంలో ఎటువంటి భేదమూ వుండదు. సముద్రంలో కురిసిన నదుల్లాగా, నీటిలో కలిసిన ఉప్పులాగా జీవబ్రహ్మలు

ఐక్యమౌతారు. రామానుజ మతంలో ముక్తిని సాలోక్యమని, సామీప్యమని, సారూప్యమని, సాయుజ్యమని నాలుగు విధాలుగా అంగీకరిస్తారు. రామానుజుల ఈ సిద్ధాంతం అద్వైత భావనకి విరుద్ధమైనా స్వాములవారు ముక్తిలోని భేదభావనలిని గుర్తించడానికి వెనుకాడలేదు. అజ్ఞానావరణమునందున్న జీవుని జ్ఞాన సిద్ధికి భక్తి సహకరించవచ్చునని స్వాములవారి అభిప్రాయమై వుండవచ్చు.

## ద్వైతం :

రామానుజుల తర్వాత భేదవాదమును ప్రతిపాదించిన మధ్వాచార్యులను మహాత్ములుగా, మహాయోగులుగా పలుమార్లు స్వామి స్తుతిస్తారు.

సన్న్యసిస్తేనే గాని మోక్షార్హత లేదని త్రిమతాచార్యుల మతం. అందుకే వారు (శంకర, రామానుజ, మధ్వ) సన్న్యసించారని స్వామి పేర్కొంటారు. అద్వైతమతానికి, ద్వైత, విశిష్టాద్వైత మతాలకి గల భేదాన్ని పదవ అధ్యాయంలో ఇలా చెబుతారు. జీవేశ్వరుల యోగము, వియోగము, సంయోగము వీటికి గల సంబంధాన్ని వివరిస్తూ ఈ మూడు ప్రశ్నలు అద్వైత శాస్త్రం దృష్ట్యే ఆలోచించాలని, ద్వైత విశిష్టాద్వైత మతాల్లో ఈ ప్రశ్నలకు సమాధానాలు దొరకవని చెబుతారు. కారణం అద్వైతంలో బ్రహ్మమాత్రమే సత్యం. మిగిలిందంతా మాయ. ద్వైత, విశిష్టాద్వైత మతాల్లో జీవుడు వేరు, ఈశ్వరుడు వేరు, ప్రపంచం కూడా సత్పదార్థమే.

## బౌద్ధం :

ప్రతి దర్శనమూ తన భావాలను అభివ్యక్తం చేయడానికి కొన్ని పారిభాషిక పదాలను ఏర్పరచుకొంటుంది. పరమపురుషార్థమైన స్థితిని అద్వైతంలో ముక్తి, మోక్షం, జీవబ్రహ్మైక్యం అని పేర్కొంటారు. బౌద్ధంలో ఆ స్థితిని నిర్వాణమని అంటారు. ఆధ్యాత్మిక గ్రంథాల్లో యోగ వాసిష్ఠం తర్వాత మోక్షానికి నిర్వాణ పదాన్ని ఉపయోగించిన వారిలో స్వాములవారు ప్రముఖులని చెప్పవచ్చు. బహుశా బుద్ధుని విప్లవాత్మకమైన ఆలోచనా విధానం, సత్యసంశోధన, జీవకారుణ్యం ఇత్యాది భావాలు

స్వామికి స్ఫూర్తినిచ్చి వుండవచ్చు. అందుకే స్వాములవారు బుద్ధుణ్ణి లోకోద్ధారకుడుగా పేర్కొంటారు. నిర్వాణమంటే సకల వాసనా రహితమైన స్థితి అని, సర్వసంగ పరిత్యాగమే దానికి ప్రధాన సాధనమని, సర్వసంగ పరిత్యాగమే సన్న్యాసమని, సన్న్యాసమే నిర్వాణానికి మార్గమని అదే బుద్ధుని జీవన సారాంశమని పలుమార్లు స్వామి వక్కాణించారు. తపస్సు ద్వారా సిద్ధి పొందిన మహాత్ములలో బుద్ధుడు కూడా ఒకడని, అతడు ఆస్తికుడైనా, నాస్తికుడైనా లోకానికి పూజనీయుడని అంటారు. నిర్వాణ పదవికి జాతి, లింగభేదాలని పరిగణించకూడదన్న బుద్ధుని వాదన స్వాములవారిని అత్యంత ప్రభావితుల్ని చేసి వుండవచ్చని గ్రహించవచ్చు.

## జైనం :

సమ్య ద్దృష్టి, సమ్యక్ చరిత, సమ్యగ్ జ్ఞానమనే త్రిరత్నాలతో జీవుడైనవాడు మోక్షానికి అర్హుడౌతాడు కనుక, జైనులు మోక్షాన్ని 'అర్హత్' అనే శబ్దంతో వ్యవహరిస్తారు. వారుకూడా బుద్ధునిలాగా బంధ మోక్షాలనంగీకరించారు కాని దైవాన్ని అంగీకరించలేదు. సత్యజ్ఞాన తపోధ్యానాదుల ద్వారా సన్న్యసించి మానవుడు సిద్ధాత్ముడు కాగలడని జైనుల మతం. ఈ విషయాన్నే స్వామి తమ యతీంద్రగీతలో 14, 17 అధ్యాయాల్లో సూచించారు.

## సిక్కు :

పవిత్రజీవనం పరమపదానికి మార్గము. అటువంటి జీవనం గురుబోధనల ద్వారా సులభసాధ్యమౌతుందని సిక్కుల సిద్ధాంతాలను యతీంద్రులు పలుమార్లు పేర్కొంటారు.

## క్రిస్టియన్, ఇస్లామ్ :

మహాత్ములైనవారు కేవలం ఏదో ఒక ప్రాంతానికి మాత్రమే పరిమితం కారని, దేశమేదైనా, కాలమేదైనా వారి తపస్సు, అమలిన జీవన విధానం వారి పరమోత్కృష్టతకి కారణాలౌతాయని క్రైస్తవ మత ప్రవక్తయైన జీసను క్రీస్తును,

మహమ్మదీయ మత ప్రవక్తయైన మహమ్మదు నబీని అనేకమార్లు స్వామి స్మరించుకొంటారు. మహమ్మదీయుల్లో సమాజపరంగా తేడాలున్నా, మత స్వాతంత్ర్యం విషయంలో మాత్రం మహమ్మదీయులందరూ సమానులే అని జాతి నిర్ణయ యోగంలో చెబుతారు. ఇలా దేశకాలాలకతీతంగా ఉత్తమ బోధనలని ఎవరు ప్రవచించినా వాటిని అందరూ గౌరవించాలని స్వాములవారి ప్రగాఢవిశ్వాసం.

దూషించువారు లేనిచో తన దోషములు తనకు
తెలియుటెట్లు ? కాన మనలో తప్పులు
వెదకువారు మనకు గురువులని తలంచవలయును.

కోపముగల వారి జీవితములో గల అనుష్ఠానములన్నియు
కళాయి లేని పాత్రలో వండినపప్పు,
పులుసు వంటివని మఱవకుడు.

సిమెంటుతో చేయబడిన వస్తువులు నీటిలో నుండినను
కరగవు. కాని అవి గట్టిపడుటకు ముందు
నీళ్లు తగిలిన చెడిపోవును. అదేరీతిగా పరిపక్వదశ
కలిగిన జీవన్ముక్తుడు సంసారి జన మధ్యమున
నుండినను చెడడు.

అజ్ఞాన దృష్టి, జ్ఞాన దృష్టి, విజ్ఞాన దృష్టి అని దృష్టులు
మూడు రకములు. కులమునే చూచుట
అజ్ఞానదృష్టి. గుణములనే చూచుట
జ్ఞాన దృష్టి. అందరిలోనున్న భగవంతుని
చూచుట విజ్ఞాన దృష్టి.

శ్రీమలయాళ స్వామి

పంచమాధ్యాయం

# శ్రీ మలయాళ యతీంద్ర గీత-సాంఘిక ప్రయోజనం

శ్రీ మలయాళ యతీంద్రులకు శ్రీ నారాయణ గురుదేవులు పరమగురువులు. నారాయణ గురుదేవులు అద్వైత వేదాంత విజ్ఞానంలో ఎంత అగ్రగణ్యులో, బ్రహ్మనిష్ఠలో ప్రముఖులో, సంఘసంస్కరణలో కూడా అంతే గొప్పవారు. తన చుట్టూవున్న సమాజంలోని దోషాలను తొలగించడానికి కృషి చేసేవాళ్లు మహాత్ములు. పుట్టినవాడు పుట్టినట్లే మరణించుటలో గొప్పతనం లేదు. చుట్టుపక్కల వున్న మాలిన్యాన్ని తొలగిస్తే శారీరకంగా ఆరోగ్యవంతులము అవుతాము. సమాజంలో పేరుకొన్న దురాచారాలను, మూఢవిశ్వాసాలను నిర్మూలిస్తే దేశాభ్యున్నతికి పాటుపడిన వారమౌతాం. అలాపాటు పడ్డవారే మహనీయులుగా చరిత్రలో ప్రసిద్ధికెక్కారు.

శ్రీ నారయణ గురుదేవులు అద్వైతవాది. అద్వైత వేదాంతము సర్వం బ్రహ్మమయము అని బోధిస్తుంది. సమదృష్టితో సర్వం చూడగలవారే బ్రహ్మనిష్ఠులు. మాటలతో సర్వం సమానమని బోధిస్తూ, చేతల్లో తేడాలను పాటించేవారు. ''మనస్యన్యత్ వచస్యన్యత్ కర్మణ్యన్యత్ దురాత్మనాం'' అన్నట్లు దురాత్ముల కింద పరిగణింపబడతారు. ''ప్రదీప్తమైన అగ్నినుండి వెలువడే స్ఫులింగాలలాగా ఈ జీవులు బ్రహ్మం నుండి ఉదయిస్తున్నార''ని శ్రుతివచనం. కాబట్టి భగవంతుని దృష్టిలో, తత్త్వదృష్టిలో, తత్త్వజ్ఞుని దృష్టిలో అందరూ సమానులే. అందుకే భగవద్గీతలో ''విద్యావినయ సమ్పన్నే బ్రాహ్మణేగవిహస్తిని'' అని చెప్పడం జరిగింది. వేదార్థసార సంగ్రహమైన గీత చెప్పిన మాట ఇది.

శ్రీ నారాయణ గురుదేవులు మాటల్లో వున్న వేదాంతాన్ని ఆచరణలోనికి తెచ్చిన మహానుభావులు. అంటరాని వారుగా, వెలివేయబడ్డ సోదర మానవాళికి ఆయన వినూత్న చైతన్యం కలిగించారు. శ్రుతి విరుద్ధమైన స్మృతులలో నిబంధింపబడిన దురాచారాలు అనుసరింప దగినవి కావన్నారు. ఆచరణాత్మకంగా దళిత జాతుల పురోభివృద్ధికై పాటుబడ్డారు. ''ఒకే కులం, ఒకే దేవుడు, ఒకే మతం'' అని ఎలుగెత్తి చాటారు. తన సంస్కరణలను అంగీకరింపక ఎదుర్కొని వాదింపవచ్చిన పండితులను వాదపటిమతో ఓడించారు. తత్త్వవేత్తగానేకాక, ఒక

గొప్ప సంఘసంస్కర్తగా చరిత్రలో స్థిరపడిపోయారు. ఆర్యసమాజ స్థాపకులైన దయానంద సరస్వతి మొదలైనవారు హిందూ సమాజ సంస్కరణకు ఎలా పాటుబడ్డారో, అలాగే నారాయణ గురుదేవులు కూడా హిందూసంఘ సంస్కరణకే తీవ్రమైన కృషిచేసి ''నారాయణగురు సంప్రదాయానికి'' మూల పురుషులైనారు.

వారి ఉద్యమాన్ని ఆంధ్రావనిలో మరొక రీతిలో కొనసాగించడానికే శ్రీ మలయాళ యతీంద్రులు కృతనిశ్చయులయ్యారు. తపోనిష్ఠను కొనసాగించే కాలంలోనే వారిలో సమాజసంస్కరణోద్యమానికి తగిన బీజాలు అంకురించాయి. అవి క్రమక్రమంగా పెరిగి పెద్దవైనాయి. శ్రీ వ్యాసాశ్రమం అనే వటవృక్షం అలా రూపొందిందే.

సన్న్యాసి అంటే సమస్తాన్ని వదిలిపెట్టినవాడు కాడని, నివృత్తి మార్గానుయాయి ప్రాపంచిక విషయాలకతీతుడు కాడని శ్రీ మలయాళ స్వాములవారి అభిప్రాయం. సమస్త ప్రాణికోటి భగత్స్వరూపమే గనుక, కేవలం తను మాత్రమే మోక్షాన్ని పొందాలని గాక, సమస్త మానవాళి తరించబడాలని విశ్వసించారు. అందుకే సమాజశ్రేయస్సు అత్యంతావశ్యకమని మధ్యయుగానికి చెందిన భారతీయ తాత్త్వికులలో, సామాజిక చైతన్యం కొరవడడమే నేటి సాంఘిక దుస్థితికి కారణమని వారి భావం.

అతి ప్రాచీన కాలంలో బుద్ధుడు సంఘస్థితిని గూర్చి ఆలోచించాడు. సంఘ సంస్కరణకు అవసరమైన ఉద్యమం కొనసాగించాడు. ఈ మధ్యకాలంలో ఎవరూ సంఘాభ్యున్నతికి పాటుబడినట్లు దాఖలాలులేవు. ఆధునిక యుగంలో బ్రహ్మసమాజం, ఆర్యసమాజం సాంఘిక పరిస్థితిని చక్కబరచటానికి ప్రయత్నించాయి. స్మృతుల వల్ల హిందూసంఘానికి చాలావరకు అన్యాయం జరిగిందనడంలో సందేహంలేదు. కులప్రాతిపదిక మీదనే అవి నేరాలకు శిక్షలు విధించాయి. శంకరాది తత్త్వవేత్తలు మత ప్రచారం మీద దృష్టిపెట్టినారేగాని, సంఘసంస్కరణ పట్ల శ్రద్ధ చూపలేదు. అందుకే శ్రీ మలయాళస్వాములవారు ఈ విషయాలను పరామర్శిస్తూ ఇలా వ్రాశారు.

''శంకరాదులును మత విషయమై అపారమగు కృషి సల్పిరే గాని సంఘ సంస్కరణ విషయమై ఎక్కువ పని చేసినట్లు కనపడదు. స్మృత్యాదులను

శంకరాదులు చూచి యుండియు సంఘసంస్కరణమునకు గడంగక ఏలమానిరో తెలియకున్నది. ఏలన అట్టి విశాల హృదయులై జ్ఞానస్వరూపులైనవారు లోకములో గల అంధ విశ్వాసములనెట్లు సహించినారో తెలియ జాలము. మొత్తమ్మీద ఆ కాలగతియు, నాటి జనుల స్థితియు దాని కనుగుణముగ నుండి యుండవచ్చును. ఆధునిక యుగమున రాజారామ్ మోహన్‌రాయ్, దయానందస్వామి మున్నగువారు సంఘసంస్కరణమునకెక్కువ పాటుబడిరి. జనులను బంధించి యుండిన కల్పిత శాస్త్రశృంఖలాలను వీరు వివేకమను ఉక్కుగొడ్డలిచే నఱికివేసిరి. నిరర్థక కర్మలచే నిర్మించబడిన దృఢమగు కోటలను వీరు ఆత్మోద్బోధమను ఫిరంగి గుండ్లచే ధ్వంసమొనర్చి అందు బంధింపబడియుండిన సోదర మానవులను వెలికి గొనివచ్చిరి. జనులయభివృద్ధికి అడ్డు కలుగజేయు కల్పిత గ్రంథములనేకములు గలవు. స్వార్థపరులగు వారవియన్నియు ఈశ్వర నిర్మితములనియు, మహర్షి ప్రోక్తములనియు జనులు నమ్మునట్లు చేయుటకు ప్రయత్నించిరి. నమ్మనివారు నాస్తికులనియు, వేదదూరులనియు రాజులకు బోధించి దండింపజేసిరి. ఈ దేశపతనమునకు ముఖ్యకారణమిదియే. సత్యబుద్ధిగల వారెవరును యుక్తాయుక్తములకు విరుద్ధములగు వాక్కులు దైవ వచనములనియో, ఋషిప్రోక్తములనియో నమ్మజాలరు. అట్లు నమ్మరాదనియే సచ్ఛాస్త్రము బోధించుచున్నది. అయినను సత్యధర్మములను తెలిసికొని, అనుష్ఠించి లోకమునకు బోధించుటకు తగిన సంఘము మన దేశములో లేకపోయినది''.

పరివ్రాజక ధర్మం అనుష్ఠిస్తూ కూడా సాంఘిక అభివృద్ధి పట్ల శ్రీ మలయాళ స్వాములవారు చూపిన శ్రద్ధ మనకు స్పష్టంగా తెలుస్తుంది. తాముతరించిన వారు ఇతరులను తరింపచేయాలన్నదే వారి ఆశయం. ఈ ఆశయాన్ని ఆధ్యాత్మికంగానే కాక సాంఘికంగా కూడా అమలు చేయడానికి స్వాములవారు ప్రయత్నించారు. సంఘంతో సంబంధం లేకుండా ఎవరూ బ్రతకలేరని, ఎంత తత్త్వవేత్తయినా సంఘాన్ని విస్మరించకూడదని స్వాముల వారి బోధ.

కాలానుగుణంగా, దేశానుగుణంగా, పాత్రానుగుణంగా ఆచార వ్యవహార రూపమైన ధర్మాలు మార్పుచెందుతూ వుంటాయి. ఆ మార్పు అవసరం కూడా.

ఆ యుగంలోని ధర్మాలు సర్వకాల సర్వావస్థల్లో ఒకే రూపంగా వుండాలనేది కుదరదు. అంతేకాదు ప్రజల అభివృద్ధికి ఆటంకం కలిగించేవన్నీ అధర్మాలేగానీ ధర్మాలుకావు. గనుక ఆరోగ్యవంతమైన సమాజంకోసం నడుంబిగించి, సాంఘిక కార్యక్రమాన్ని చేపట్టినపుడు, అనేకమంది శిష్యులు స్వాములవారు లౌకిక వ్యాపారంలో దిగిపోయారని భావించారు. వారి నుద్దేశించి స్వాములవారు ఒక సనాతన సభలో ఇలా అన్నారు.

''నేను ప్రపంచ ప్రాణులపై ప్రేమను పరిత్యజించి అత్యధిక విరక్తినవలంబించి ఏకాంతమందుండు కాలములో, నాపై మిక్కిలి ప్రీతినెఱపిన అనేక భక్తులకిపుడు లోకసేవలో కొంచెము ప్రవేశించిన నాయందు సంపూర్ణ విశ్వాసము లేకపోయినది. నేను మాత్రము నాయొక్క ప్రస్తుతస్థితి నాటికంటె వేయిరెట్లెక్కువ శ్రేష్ఠమయినదనియు, విధియుక్తమైనదనియు, ఋషిధర్మమనియు తలంచుచున్నాను. ఏకాంతమున ఏకాకినై నేను కాలము గడిపినది ఆ స్థితి సర్వోత్కృష్టమైనదని తలచికాదు. లోకసేవ చేయుటకు తగిన పరిపక్వత గలుగచేసికొనుటకే అట్లొనర్చితినని మీరు మరువకుందురు గాక''!

దయామయుడగు శ్రీ మన్నారాయణమూర్తి అవతారమెత్తి అధర్మమును రూపుమాపి ధర్మమును నెలకొల్పుటకూడా లోకసేవయే గదా ! కాని అవతార పురుషులు చేయదగిన పని మనకు సాధ్యపడునా ? అని కొందరు సంశయింప వచ్చును. వారు చేసినంత గొప్ప కార్యము మనము చేయంబనిలేదు. వారి వారి శక్తి కొలది ఆత్మ వంచన లేక చేసిన చాలును. ఏనుగునకు కావలసినంత ఆహారపదార్థము చీమకు పనిలేదు కదా ? మన ఋషి సత్తములు ప్రయాసపడి వేదములు, ఉపనిషత్తులు, యోగశాస్త్రములు, వైద్యగ్రంధములు, వ్యాకరణాది సమస్త శాస్త్రములు, బోధింపకపోయి యున్నచో ప్రస్తుతము మన జీవితము పశుతుల్యమై యుండునుగదా ! తన ఒక్కరి ముక్తిమాత్రము చూచుకొనుటయు ఒక విధమగు స్వార్థమే అగును. అట్టి మహర్షుల వంశములో పుట్టిన మనము వారు చేసిన పవిత్ర కార్యములలో మన శక్తి కొలది పాటు పడనిచో మన జీవితము జీవితమా ? ఇదంతయు కనివినినవారు కూడా లోకసేవాతత్పరులగు పుణ్యపురుషులయందు అనాదరణము చూపుట కడు శోచనీయము. సాధకులు,

జిజ్ఞాసువులు, ముముక్షువులు తమ బ్రహ్మనిష్ఠకు ప్రతిబంధం కలిగింపని సేవలు మాత్రమే చేయాలని అది దైవసేవ అయినా, మానవసేవ అయినా జీవకోటిసేవ అయినా ఒకటే అని స్వామి వివరించినారు.

పరస్పర ప్రేమతోనూ, సమన్వయ దృష్టితోను సంఘంలోని ప్రజలందరూ కలిసిమెలసి బ్రతకాలన్నది శ్రీ స్వాములవారి ధ్యేయం. ప్రజానీకం లో ఏ విషయంలోనూ ఒకరి ఆత్మోన్నతికి ఆటంకం కలిగించే పరిస్థితులను స్వాములవారు సహించేవారుకాదు. యుక్తాయుక్త వివేచనకు దూరమైన వాక్యాలను దైవవచనాలని నమ్మడం తగదని, అదికేవలం మూఢవిశ్వాసం మాత్రమే అని శ్రీ స్వాములవారు అభిప్రాయపడ్డారు. హిందూసమాజం మూఢవిశ్వాసాలతో మునిగి పోయిందని, ఆ విశ్వాసాలు ఎంత దారుణంగానూ, పరస్పర విరుద్ధంగానూ వుండేవో చెబుతూ స్వామి ఇలా అన్నారు.

''పరిశుద్ధులైన వారికి మాత్రమే దైవికమైన అనుష్ఠానాన్ని నేర్పాలని, పవిత్రత లేని వారిని దూరంగా తరిమి వేయాలని మనలోని సనాతనులంటున్నారు. ఇది ఎంత మూఢ స్వభావము? రోగికి ఆరోగ్యం కలిగిన తరువాతనే ఔషధం ఇవ్వాలని చెప్పినట్లున్నది. ఔషధము, పథ్యము లేకపోతే రోగమెలా శమిస్తుంది ? ఈ తత్త్వం గ్రహింపక పోవటం వల్లనే ఈ పుణ్యభూమి హీనస్థితికి వచ్చింది. ఇలాంటి దుష్ట భావన వలననే దేశంలో సంఘసంస్కరణకు అవకాశం లేకుండా పోయింది''.

ఈ స్థితిని చక్కదిద్దడానికి, తద్వారా హిందూ సమాజాన్ని చైతన్యవంతం చేయడానికి శ్రీ మలయాళ యతీంద్రులు తీవ్రమైన కృషిచేశారు. సంఘంలో కొందరి స్వార్థాన్ని ప్రతిబింబించే గ్రంథాలను గ్రంథ భాగాలను ఋషిప్రోక్తంగా వారు భావించలేదు. అవన్నీ కల్పిత గ్రంథాలనే వారి అభిప్రాయం.

భారతీయ సాంఘిక వ్యవస్థని తరతరాల నుండి శాసిస్తున్న మనుస్మృతివల్ల సమాజానికి మేలు జరిగిందా ? కీడు జరిగిందా ? అన్న విషయంలో వారి అభిప్రాయాన్ని నిర్ద్వంద్వంగా ఇలా ప్రకటించారు.

''బ్రహ్మవిషయమునై చూచిన మనువు అతీంద్రియ జ్ఞానము కలవాడనియు, అఖండ బ్రహ్మనిష్ఠుడనియు నెట్టి వారికైనను గోచరింపకపోదు.

ఈ కారణముచే మను మహర్షి నిష్ఠాగరిష్ఠుడనియు మనము గ్రహించి వారికి నమస్కృతి నొనర్చుట శ్రేయోదాయకము. జాతి విషయమై, సంఘవిషయమై గల భాగము క్రూర పిశాచములు కూడా చెప్పనట్లును, పరమనీచులు కూడా తలంచనట్లును, పరమ క్రూరులు కూడా చేయనట్లును వ్రాసెను. అయితే ఈ విషయం శ్రీ మను మహర్షిచే చేయంబడినది గాదనియు, మధ్యకాలమున జాతి వైషమ్యావేశ ఉద్రేకపూరిత హృదయులగు ఎవరో క్రూరమగు తలంపుతో చేసియుండ వచ్చునియు పలువురు నుడివిరి. మరియు శ్రీ దయానంద సరస్వతీ స్వామివారు 'సత్యార్థ ప్రకాశము' లో ఈ విషయమై విమర్శించి యుండుటయేగాక వారు ప్రచురించిన మనుస్మృతిలో సాక్షాత్ మనువుచే రచింపబడిన శ్లోకములు ఫలానివనియు, అట్టి మనువు ఆశయమునకు సరిపోని కల్పితములైన శ్లోకములు ఫలానివనియు వేరుపరచి చూపియున్నారు. అయినను మనువు అపార మహిమగల బ్రహ్మజ్ఞుడని మనమందరమును తలంచవలయును. మనము క్షీరనీర న్యాయముననుసరించి సముచితమై సర్వజన సమ్మతమై జనులకు ఆచరణీయమగు ముఖ్య విషయమును మాత్రమే గ్రహించిన చాలును''.

మూఢ విశ్వాసాలతోనూ, కువ్యాఖ్యాల తోనూ మలినమయిన ప్రాచీన సాహిత్యాన్ని నిశితంగా పరిశీలించి క్షీరనీర విభాగ న్యాయంతో విషయ నిర్ధారణ చేయాలని వారి అభిమతం.

## హిందూ సమాజంలోని దురాచారాలు :

ఉపనిషత్తుల కాలంలో హిందూసమాజం మహోన్నత స్థితిలో వుండేదని నాటి సారస్వతాన్ని పరిశీలిస్తే తెలుస్తుంది. ఎంతో మహోన్నతమైన భావాలు ఉపనిషత్తుల్లో మనకు గోచరిస్తాయి. అయితే ఆ తర్వాత వచ్చిన స్మృతుల కాలంలోనూ, పౌరాణిక యుగంలోనూ అనేక మూఢవిశ్వాసాలు, దురాచారాలు సమాజంలో ప్రవేశించాయి. మహోన్నతమైన ఒక సమాజంలో ఇలా ఎందుకు జరుగుతుంది ? దీనికి సమాధానం చెప్పడం కష్టం. ఒక వ్యక్తి జీవితంలో ఉచ్ఛనీచావస్థలు ఏర్పడినట్లే ఒక జాతి జీవితంలో కూడా అలాంటి అవస్థ సంభవిస్తుందని చరిత్రవల్ల తెలుస్తున్నది. ''నీచైర్గచ్ఛత్యుపరిచ దశా

చక్రనేమిక్రమేణ'', ''చక్రార పంక్తి రివ గచ్ఛతి భాగ్యపంక్తిః'' అన్నట్లు సమాజంలో కూడా ఈ దశలు ఏర్పడుతూ వుంటాయి. భగవద్గీతలో శ్రీకృష్ణుడు అనాదిగా ప్రచారంలో వుండిన బ్రహ్మ విద్య కాలక్రమంలో నశించిందని, దానినే మళ్ళీ తాను బోధిస్తున్నానని అర్జునుడితో చెప్పాడుగదా ! అందువల్ల హిందూసమాజంలో కాలక్రమేణ వర్ణజాతి భేదాలు, స్త్రీలకు, శూద్రులకు బ్రహ్మ విద్యాధికార నిరాకరణ, అస్పృశ్యతాది మూఢ విశ్వాసాలు, దురాచారాలు చోటు చేసుకున్నాయి. వీటిని శ్రీ మలయాళ స్వాములవారు అత్యంత సముచితమైన పద్ధతిలో తార్కికంగా ఖండించారు. వేదంలో వీటికాధారం లేదని నిరూపించారు. కల్పిత శాస్త్రాలను విశ్వసించరాదని ప్రతిపాదించారు. ఈ పరిస్థితులను చక్కదిద్దుకోడానికి అవసరమైన పరిష్కారాలను మాటల్లోనే కాక, చేతల్లోకూడా తమ సంస్కరణోద్యమంలో కొనసాగించారు. అందువల్లనే ఆయన బ్రహ్మవేత్తగానేకాక, సంఘసంస్కర్తగా కూడా గుర్తింపు పొందారు.

## వర్ణ- జాతి భేదాలు :

హిందూ సమాజంలో వర్ణవ్యవస్థ చాలా ప్రధానాంశం. సమాజ సుస్థితికి అది చాలా అవసరమని వాదించేవారు వున్నారు. అది కొందరి స్వార్థానికే ఉపయోగపడి, మరికొందరి వికాసాన్ని నశింపచేసే వ్యవస్థ అని భావించే వారూవున్నారు. ఆ వ్యవస్థ ఇపుడు ఆచరణలో లేదు. అయినా దాని దుష్ప్రభావం సమాజంలో కనిపిస్తూనే వుంది. ఆధునిక సంస్కర్తలందరూ ఈ వ్యవస్థలోని బాగోగులను పరిశీలించినవారే. అందులో అనేకులు అందుకు తగిన పరిష్కార మార్గాలను కూడా చూపారు. శ్రీ స్వాములవారు తమ ''యతీంద్ర గీత''లో ఆరవ అధ్యాయానికి ''జాతి నిర్ణయ యోగ''మని నామకరణం చేశారు.

మొట్టమొదటిసారి వర్ణాలను గూర్చిన ప్రసక్తి పురుషసూక్తంలో కనపడుతుంది. ''చాతుర్వర్ణ్యం మయా సృష్టమ్'' అని భగవద్గీతలో కృష్ణుడు చెబుతాడు. ఈ నాలుగు వర్ణాల ఉత్పత్తి ఎలా జరిగింది ? ఎప్పుడు జరిగింది ? ఎందుకు జరిగింది ? దీని కర్త ఎవరు ? ఈ వర్ణ వ్యవస్థను పుట్టిన కులమాధారంగా

నిర్ణయించాలా ? గుణాలనాధారంగా చేసుకొని నిర్ణయించాలా ? అనేవి ముఖ్యసందేహాలు. శ్రీ స్వాములవారు ఈ సమస్యను అనేక కోణాల్లోంచి పరిశీలించి, పరీక్షించి యుక్తికి శాస్త్రానికి విరుద్ధంకాని రీతిలో సామాన్యమైన పాఠకునికి అర్థమయ్యేలా వివరిస్తారు.

వేదోక్త పురుషస్యైవ ముఖబాహూరుపాదతః ।
బ్రహ్మణాద్యా అజాయ న్తేత్యుచ్యతే బహుభిర్జనైః ॥ VI - 6
ముఖం కిమస్యకౌ బాహూకావూరూచరణౌసతః ।
ఇత్థం ప్రశ్నస్య సద్భావాద్వర్ణనాస్యేతి పణ్డితాః ॥ VI - 7

వేదపురుషుని ముఖబాహూరుపాదాల నుండి బ్రాహ్మణాది వర్ణాలు పుట్టాయని పురుషసూక్త మంత్రాన్ని ఉదాహరిస్తూ సనాతనులు వర్ణవ్యవస్థను సమర్థిస్తూవున్నారు. ఇక్కడ పరమాత్ముని ముఖం ఏది ? చేతులేవి ? తొడలేవి ? పాదాలేవి ? అనేవి ప్రశ్నలు. బ్రాహ్మణుడు ముఖం, రాజన్యుడు బాహువులు, వైశ్యుడు వూరువులు, శూద్రుడు పాదాల నుండి పుట్టాడు (అజాయత) అని అక్కడ వాక్యవిన్యాసాన్ని బట్టి సమాధానం వస్తున్నది. ఈ వాక్య విన్యాసం అనేక వాదోప వాదాలకు కారణమైంది. నిరాకారమైన పరమాత్మనుండి బ్రాహ్మణాది వర్ణాలు ఎలా పుడుతాయి ? కాబట్టి ఇక్కడ 'అజాయత' అన్న ప్రశ్నకు అర్థం లేదు. ఇక్కడ బ్రహ్మకు రూపకల్పన మాత్రమే చేయబడింది. ఈ విశ్వమంతా పరమాత్మ స్వరూపమని చెప్పడమే ఇందలి తాత్పర్యం. ఒకవేళ 'అజాయత' అన్న పదాన్ని అన్ని వర్ణాలకు సమన్వయం చేసి ఆయావర్ణాలు ఆయా అవయవాల్లోంచి పుట్టాయి అని చెప్పినా అందులో ఉచ్చనీచభేదాలెలా వస్తాయి ?

మూలాదారభ్య శాఖాగ్రపర్యన్తం హిఫలప్రదాః ।
పనసాది ద్రుమాస్సన్తి కేచిల్లోకోపకారకాః ॥ VI - 15
తత్ఫలానాం నభేదోస్తి మాధుర్యాది గుణాదిషు ।
ఏవం ముఖాది జన్యానాం నస్యాత్కాచిన్మిథోభిదా ॥ VI - 11

ఒక చెట్టు కొమ్మలు నలువైపులకు వ్యాపిస్తాయి. ప్రతి కొమ్మలోనూ ఫలాలు ధ్భవిస్తాయి. ఒక కొమ్మలో పుట్టిన పండు తక్కువదని, నీచమని, మరొక కొమ్మలో పుట్టిన పండు శ్రేష్ఠమని భావిస్తున్నామా ? అందువల్ల ఈ వర్ణనను ఆధారం చేసుకొని భావించడం తగదు. ఆయా వర్ణాల్లో రక్తభేదమే వారిలోని ఎక్కువ తక్కువ తనాలకి కారణమనే వాదాన్ని కూడా అంగీక రించలేము. ఆధునిక విజ్ఞానం కూడా ఆ వాదాన్ని అంగీకరించదని స్వామి తమ అభిప్రాయాన్ని ప్రకటించారు.

వర్ణమనేది మానవ కల్పితమా ? దైవశాసనమా ? ఎప్పుడు ఆరంభమైంది ఈ వర్ణం ? ఇత్యాది సందేహాలకి స్వామి సహేతుకమైన వాదనలని ఇలా ప్రతిపాదిస్తారు. ఆరంభంలో వర్ణం లేదు. మానవుడు తనకు తాను కల్పించుకొన్నదే ఈ వర్ణం.

ఏక వర్ణమిదం పూర్వం విశ్వమాసీద్యుధిష్ఠిర ।
కర్మక్రియావిశేషేణ చాతుర్వర్ణ్యం ప్రతిష్ఠితమ్ ॥ VI-46

పూర్వం ఒకే వర్ణం వుండేదని, కర్మక్రియా విశేషం వల్ల చతుర్వర్ణాలేర్పడ్డాయని భారత వచనం. సృష్ట్యాదిలోనే చతుర్వర్ణాలు వున్నదినిజమైతే, పై భారతోక్తి అసత్యమౌతుంది. అలాగే ఈ నాలుగు వర్ణాలు మనుషుల రంగుల్ని బట్టి రూపొందాయనే వాదనను కూడ ఖండిస్తూ

బ్రహ్మక్షత్రియ విట్ఛూద్రాన్ చతుర్వర్ణాన్ గుణాత్మకాన్ ।
విప్రశ్శుక్లో నృపో రక్తః పీతో వైశ్యోఽన్త్యజోఽసితః ॥ VI - 47
శుక్లాది గుణభేదేన వ్యవస్థేయం న యుజ్యతే ।
చతుర్ష్వపి చ వర్ణేషు దృశ్యన్తే శుక్లిమాదయః ॥ VI - 48

తెలుపు, ఎరుపు, పసుపు, నలుపు రంగులు కలవారు బ్రాహ్మణ, క్షత్రియ, వైశ్య, శూద్రులైనారనే మాట కూడా అర్థరహితమే అంటారు స్వాములవారు.

ఎందుకంటే ఉన్నత వర్ణంలో నల్లని రంగువారు, క్రింది వర్ణంలో తెల్లటి వారు కనిపిస్తూనే వున్నారు. ఒక్కొక్క వర్ణంలోనూ నాలుగు రంగులూ దర్శనమిస్తున్నాయి. అలాంటప్పుడు శరీర వర్ణాన్ననుసరించి బ్రాహ్మణాది వర్ణాలను కూడా నిర్ణయించాలనే మాటకు ఏమాత్రం విలువ లేదు. అయితే శుక్లాది వర్ణాలను ఎలా సమన్వయం చేసుకోవాలి ? ఇందుకు శ్రీ స్వాములవారు చక్కని సమాధానం ఇలా చెప్పారు.

అతః శుక్లాది శబ్దైస్తు లక్ష్యన్తే సాత్త్వికాదయః ।
చాతుర్వర్ణ్యవిభాగోయం జ్ఞేయ స్తదనుసారతః ॥ VI - 49

అభిదావృత్తిని వదలిపెట్టి లక్షణావృత్తి నాశ్రయించి శుక్లాది శబ్దాలను సాత్త్వికా ద్యర్థాలలో స్వీకరించాలి.

ఋజవశ్శుద్ధ వర్ణాభాః క్షమావన్తో దయాళవః ।
స్వధర్మనిరతా యే స్యుస్తే ద్విజేషు ద్విజాతయః ॥ VI - 51

కపటం లేని వారు, దయగలవారు, ధర్మనిరతులు, సత్త్వగుణ సంపన్నులు శుక్ల శబ్దం చేత సూచింపబడినారు.

కామభోగప్రియాస్తీక్ష్ణాః క్రోధనాః ప్రియసాహసాః ।
త్యక్తస్వధర్మరక్తాంగాస్తే ద్విజాః క్షత్రతాం గతాః ॥ VI - 52

కామభోగ ప్రియులు, కోపశీలురు, ధైర్యసాహసపరులు, రజోగుణ ప్రధానులు రక్తశబ్దంచే గ్రహింపబడతారు.

గోషు వృత్తిం సమాధాయ పీతాః కృష్యుపజీవినః ।
న స్వకర్త కరిష్యన్తి తేద్విజా వైశ్యతాం గతాః ॥ VI - 53

గోరక్షకులు, కృషితో బ్రతుకువారు, సత్త్వరజోమిశ్ర సంపన్నులు పీతశబ్ద వాచ్యులు.

హింసానృత ప్రియాః క్షుద్రాస్సర్వకర్మోప జీవినః ।

కృష్ణాఃశౌచపరిభ్రష్టాస్తే ద్విజాః శూద్రతాం గతాః ॥ VI - 54

ప్రాణిహింసాపరులు, అసత్య ప్రవర్తకులు, శౌచాచార భ్రష్టులు, తమస్స్వభావులు కృష్ణశబ్దంచేత సూచింపబడుతున్నారు. కాబట్టి వర్ణాలు (రంగులు) గుణసూచకాలేకాని బ్రాహ్మణాది జాతి వాచకాలు కావని నిరూపించారు.

మానవజాతి అంతా ఒకటే. మొదట్లో అది ఏకవర్ణమే. ఆ వర్ణానికి చెందినవారు పైచెప్పిన లక్షణాలను తమలో వృద్ధిపరచుకున్నారు. అందువల్ల శుక్ల, రక్త, పీత, కృష్ణ వర్ణులుగా పేర్కొనబడ్డారు. కాలక్రమంలో ఆ జాతులనే బ్రాహ్మణ, క్షత్రియ, వైశ్య, శూద్రులుగా పేర్కొనడం జరిగింది. ఒకే జాతి తమ గుణకర్మల నాధారం చేసుకొని నాలుగు జాతులుగా రూపొందడం జరిగింది. ఇది ఒకే ఒక జన్మలోకూడా జరగవచ్చు. ఒక జాతిలో నాలుగు భేదాలెలా వస్తాయని సందేహించపనిలేదు. అందుక్కారణం గుణభేదమే. ఆ గుణాన్ని బట్టిన కర్మ భేదమే. అలా అన్వయించుకుంటేనే 'చాతుర్వర్ణ్యం మయాసృష్టమ్' అన్నమాట సరిపోతుంది. బ్రాహ్మణాది వర్ణాలకు నామకరణం ఎవరు చేశారనే సందేహానికి స్వాములవారు ఇలా సమాధానం చెప్పారు.

మహానుత్పద్య తేష్వేక ఉక్తలక్షణ లక్షితాన్ ।
వ్యాహరన్ విప్రశబ్దేన కులమేకం వినిర్మమే ॥ VI - 57
శేషేష్వన్యస్సముత్పద్య శౌర్యాది గుణినః పరమ్ ।
ఆహ్వాయన్ క్షత్ర శబ్దేన నిర్మమే క్షత్రియం కులమ్ ॥ VI - 58

మనుష్యజాతి అంతా ఒకటే అయినా, వారిలోని గుణభేదాలను బట్టి వారిని విభజించి ఒక మహాపురుషుడు వాళ్లకు నామకరణం చేశాడు. అందులో మొదటి వర్గానికి ''విప్రులని' పేరుపెట్టాడు. ఆపై కొంతకాలానికి మరొక మహాపురుషుడు జన్మించాడు. శౌర్యాది గుణ సంపన్నులై చరించే మానవులను చూశాడు. వాళ్లను ''క్షత్రియు''లని పిలిచాడు.

అవశిష్టేషు తేష్వేవ స్వకర్మత్యాగశీలషు ।
వైశ్యశబ్దం ప్రయుఞ్జానో వైశ్యజాతిం వినిర్మమే॥ VI - 59

మరొక మహానుభావుడు తక్కినవారిలో కొందరిని ''వైశ్య'' శబ్దంతో వ్యవహరించాడు.

అవశిష్టాశ్చ యే చాన్యే సర్వకర్మోప జీవినః ।
శౌచాచార పరిభ్రష్టాస్తే జనాశ్శూద్రతాం గతాః ॥ VI - 60

ఇలాగా మూడు జాతులు వేరుకాగానే తక్కిన వారంతా ఇతరుల నుండి వేరుచేయబడి, శౌచాచార విహీనులైనందున ''శూద్ర'' శబ్దంతో వ్యవహరింపబడినారు. వర్ణవ్యవస్థ ఇలా ఏర్పడిందే.

ఈ పైవాదాన్ని సమర్థించటానికి శ్రీ స్వాములవారు ఈ క్రింది యుక్తులను ఇలా పేర్కొంటారు.

యథా జినమునీన్ద్రస్య చోపదేశానుయాయినః ।
జైనా ఇతి సమాఖ్యాతా స్తథా బుద్ధానుయాయినః ॥ VI - 61
బౌద్ధా ఇతి సమాఖ్యాతా ఏవం క్రీస్త్వనుయాయినః ।
క్రైస్తవా ఇతి విఖ్యాతాస్తథానానక్ మతానుగాః ॥ VI - 62
సిక్ఖశబ్దేన కథ్యన్తే దయానందానుయాయినః ।
ఆర్యసామాజికాః ప్రోక్తాస్సమాజోద్ధార హేతవః ॥ VI - 63
శఙ్కరాచార్య సిద్ధాన్తవాది న్యో క ద్వైతినస్తథా ।
మధ్వరామానుజాచార్యమతగా మాధ్వవైష్ణవాః ॥ VI - 64
ఖ్యాతా మహమ్మదీయాశ్చ నిబిసమ్మత యాయినః ।
ఏవమేవహి వర్ణానాం స్యాద్వ్యవస్థేతి బుధ్యతామ్ ।
ఇతోధికం పురాణేషు తత్రతత్రావలోక్యతామ్ ॥ VI - 65

మానవులలో జినుడొక మహానుభావుడు. అతనిని అనుసరించినవారు జైనులు అయ్యారు. అలాగే మహా పురుషుని బుద్ధుని అనుయాయులు బౌద్ధులయ్యారు. క్రీస్తును ఆదర్శంగా పెట్టుకున్నవారు క్రైస్తవులయ్యారు. నానక్

మతం పాటించినవారు సిక్కులయ్యారు. ఆధునిక మహానుభావుల్లో అగ్రగణ్యుడైన దయానందుని అనుసరించినవారు ఆర్యసమాజకులయ్యారు. శ్రీ శంకరమతానుయాయులు అద్వైతులయ్యారు. మధ్వుని శిష్యులు మాధ్వులయ్యారు. రామానుజమతాను యాయులు వైష్ణవులయ్యారు. మహమ్మదు బోధలను పాటించినవారు మహమ్మదీయులయ్యారు. వర్ణవ్యవస్థకూడా ఇలా ఏర్పడిందే. ఈ వివరణను బట్టి జన్మతః ఒకడు ఎక్కువని మరొకడు తక్కువని నిర్ణయించడం వీలుకాదు. వారి వారి స్వభావాలనుబట్టే ఉచ్చనీచదశలు ఏర్పడినాయి.

ఏదో ఒక చారిత్రక కారణం వల్ల కొందరు నిమ్నదశలో వుండవచ్చు. వారి దశ తుదివరకు అలాగే వుండాలా ? ఉన్నతస్థితిని అందుకోవడానికి వారు ప్రయత్నించకూడదా ? అలా ప్రయత్నిస్తే ధర్మవిరుద్ధమా ? ఇలాంటి విషయాలను స్వామి కూలంకషంగా చర్చించారు. అందుకు పరిష్కార మార్గంకూడా చూపారు.

నిమ్నస్థితిమతాం పుంసామున్నతస్థితిగామినామ్ ।
నిరోధో నైవ కర్తవ్యోనాస్మిన్ పాపం భవిష్యతి ॥ VI - 66

ఇప్పుడు నిమ్నస్థితిలో వుండేవారు ఉన్నతస్థితిని పొందడానికి ప్రయత్నిస్తే అందులో తప్పులేదు. వారికెవరూ అడ్డుపోరాదు. వీలైతే వారికి సాయపడాలి. అదే నిజమైన సనాతన ధర్మం. అందుకే సనాతన ధర్మాన్ని స్వాములవారు ఇలా నిర్వచించారు. ''ఇతరుల ఆత్మోన్నతికి అడ్డుపడకూడదు. మీ ఆత్మోన్నతికి అడ్డుతగిలిన తొలగించుకొనుడు. సాధ్యమైనచో ఇతరులకు సాయపడడు. ఇదే సనాతనధర్మం''. ఈ భావాన్నే స్వామి శిష్యులయిన శ్రీ విమలానందస్వామి శ్లోకీకరించారు.

జాతులన్నీ కలిసిపోవాలని, భేదాలుండరాదని, మిశ్ర వివాహాలు, మిశ్రభోజనాలు నిర్బంధంగానైనాసరే వేగంగా జరగాలని అభిప్రాయపడే వారినుద్దేశించి స్వామి ఇలా అంటారు.

కిన్తు మిశ్రవివాహేషు మిశ్రభోజనకర్మసు ।
నిర్బన్ధో నైవ కర్తవ్యో నాస్తి పాపం కృతేష్వపి ॥ VI - 67

మిశ్ర వివాహాలు, భోజనాలు పాపమూ కాదు, తప్పు కాదు. ఇష్టమున్నవారు చేసుకోవచ్చు. ఇష్టం లేనివారిని నిర్బంధించవలసిన అవసరం లేదు. ఈ నిర్బంధాలవల్ల సమాజంలో మేలు కంటే కీడు ఎక్కువ జరుగుతుంది. చరిత్రే దానికి ప్రత్యక్ష సాక్ష్యం. పైగా సన్న్యాసులు అయినవారు లోకానికి హితోపదేశం చేస్తూ ఉద్వేగం కలిగించని మార్గంలో సంస్కరణలను ప్రవేశపెట్టాలని, సామాన్య మనుజుల్లాగా తీవ్ర వాదానికి పోరాదని స్వాములవారు అభిప్రాయపడ్డారు.

విదేశాలలోని జాతిభేదాలని వివరిస్తూ అక్కడి విధానం మనదేశంలోలాగా జన్మతో ముడిపడిలేదు. అక్కడ కూడా

> అస్తి పాశ్చాత్యదేశేషు విభాగోయం చతుర్విధః ।
> ప్రభుశ్రీమత్సు వాణిజ్య భృతికారప్రభేదతః ॥ VI - 68
> కేచిదాహురిదం కిన్తు న వ్యవస్థాత్ర తాదృశీ ।
> యతోభృత్యోపి యత్నేన ప్రభుస్తత్ర భవిష్యతి ॥ VI - 69

ప్రభువులు, శ్రీమంతులు, వ్యాపారులు, శ్రామిక వర్గాలవారు అని నాలుగు తేడాలున్నాయి. అయినా నేడు కూలి చేసేవాడు రేపక్కడ ప్రభువు కావచ్చు. హిందూ సమాజంలో పరిస్థితి ఇందుకు భిన్నంగా వుంది. కడజాతిలో పుట్టినవాడు ఉన్నతస్థితి పొందటానికి తగిన అవకాశాలు హిందూ స్మృతులలో లేవు. దేశానికి స్వాతంత్ర్యం వచ్చిన తర్వాత వ్రాయబడిన ఆధునిక రాజ్యాంగంలో మాత్రమే, నిమ్న జాతీయులకు కూడా ఉన్నతస్థితి పొందడానికి అవకాశాలు కల్పింపబడ్డాయి. అంతక ముందు లేవు.

> ఏవం మహమ్మదీయేషు, సన్తి సున్న్యాదినామభిః ।
> చతుర్భేదాస్తథాప్యాత్మ స్వాతన్త్ర్యం తన్మతే సమమ్ ॥ VI - 70

మహమ్మదీయులలో కూడా షేకులు, సున్నీలు, సయ్యద్‌లు, పటాన్‌లు అనే నాలుగు తెగలున్నాయి. అయినా, ఆత్మస్వాతంత్ర్యంలో తేడాలేదు. అందుచేత స్వాములవారు హిందూమతంలో కూడా వర్ణాది విభాగాలకు జన్మసంబంధం వుండరాదని, గుణాలను బట్టి వాటిని నిర్ణయించాలని, అదే సనాతన ధర్మమని, జగద్గురువైన కృష్ణుని భావమని కూడా ప్రకటించారు.

భగవద్గీతలో జాతి విభాగం చెప్పినపుడు ఒకచోట ''గుణకర్మ విభాగశః'' అని, మరొక చోట ''స్వభావప్రభవైర్గుణైః '' అని చెప్పడం వల్ల గీతకూడా స్వాములవారి వాదాన్నే బలపరుస్తున్నది. ఇక్కడ స్వభావపదం కులాన్ని చెప్పదు. కులం ఏదైనా కావచ్చు. తనలోని ప్రకృతి, దానిననుసరించి తాను జేసే క్రియలు మాత్రమే వర్ణనిర్ణయం చేయడానికి సాధనాలు కావాలి. సంఘంలోని బ్రాహ్మణాది వర్ణాల్లో సత్త్వాదిగుణాలు జన్మనాశ్రయించి రావడం లేదు. చతుర్థ వర్ణజులలో సత్త్వసంపన్నులున్నారు. అగ్రవర్ణజుల్లో తమోమయులూ వున్నారు. అందుచేత జన్మకు దానికి సంబంధం లేదు. ఇది స్వామి సిద్ధాంతం. ఇదే విషయాన్ని మరింత విశదంగా వివరిస్తూ, అనేక ఉదాహరణలను పేర్కొంటూ స్వామి - ఇలా ప్రవచించారు.

> మయూరాది విహఙ్గేషు గవాశ్వాదిషు జాతిషు ।
> ప్రత్యక్షేణ యథాభేదో నైవం వర్ణేషు దృశ్యతే ॥ VI - 75

పక్షులున్నాయి, వృక్షాలున్నాయి. ఏ పక్షిది ఏ జాతో చూడగానే చెప్పవచ్చు. ఏ వృక్షం ఏ జాతిదో చూస్తే చెప్పవచ్చు. మృగాలు కూడా అంతే. ఆకారాన్ని బట్టి మృగజాతులను నిర్ణయించవచ్చు. ఈ నిర్ణయం ప్రత్యక్ష సత్యం. మానవులలో ఈ పరిస్థితిలేదు. మనిషిని చూడగానే కులాన్ని నిర్ణయించలేము. చూడగానే తెలిస్తే ఏ కులం ? ఏ గోత్రం ? అని అడగడ మెందుకు ? అందుచేత మానవుల్లో జాతి నిర్ణయ విభాగం కుదరడం లేదు. జన్మ సంబంధంతో జాతి నిర్ణయం చేయటానికి వీల్లేదు.

> ఈశ్వర శ్చతురశీతి లక్షభేదేన సృష్టికృత్ ।
> కథమాకృతి భేదేన బ్రాహ్మణాదీన్న సృష్టవాన్ ॥ VI - 77

ఈశ్వరుని దృష్టిలో మానవులంతా ఒక్కటే. ఆయన 84లక్షల జీవరాసుల్ని సృష్టించాడు. ఆ రాసుల్లో తేడాలు కల్పించాడు. అనుకొని వుంటే మానవుల్లో కూడా ఆయన ఆకృతి భేదాలను కల్పించి వుండేవాడే. అలా ఆయన అనుకోలేదు. అందుకే కల్పించలేదు.

తస్మాద్వర్ణ విభాగోయం నేశ్వరేణ ప్రకల్పితః ।
భగవత్కల్ప్య మానస్య నేక్ష్యతే పరివర్తనమ్ ॥ VI - 78

ఈ వర్ణ విభాగం ఈశ్వర నిర్మితం కాదు. ఈశ్వరుడు నిర్మించి వుంటే మార్పు వుండకూడదు.

విప్రక్షత్రియ విట్శూద్ర జాతీనాం పరివర్తనమ్ ।
భగవత్కల్ప్య మానస్య నేక్ష్యతే పరివర్తనమ్ ॥ VI - 79

కాని జాతులలో మార్పులు కనిపిస్తున్నాయి. విశ్వామిత్రునికి బ్రాహ్మణత్వం వచ్చింది. త్రిశంకునకు చండాలత్వం సిద్ధించింది. ఇవి పురాణ గాథలు, జాతి ఈశ్వర కృతమైతే ఈ మార్పులుండకూడదు.

కించైతే మానవాస్సర్వే బుద్ధౌజ్ఞానే తథాస్వరే ।
ఆకారే వ్యవహారే చ తథాఽవయవ సౌష్ఠవే ॥ VI - 80
ఉత్పత్తౌ మరణే చైవ వయస్యేవం ధనేపి చ ।
తుల్యరూపాస్సమీక్ష్య న్తే న తు భేదోఽత్ర దృశ్యతే ॥ VI - 81

బంగారును సృష్టించింది పరమాత్ముడు. ఆభరణాలను సృష్టించింది మానవుడు. మానవులను సృష్టించింది పరమాత్ముడు. కులాలను సృష్టించింది మానవుడు. మానవులందరూ ఆకారంలో, వ్యవహారంలో చావుపుట్టుకల్లో సమానంగా ఉన్నారు. ఏదైనా భేదం వుంటే అది మనం కల్పించుకొన్నదే.

వర్ణసృష్టిర్గుణైః పూర్వజన్మనః కర్మభిర్యది ।
నానారుచి ఫలోత్పాద కారక ద్రుమవద్భవేత్ ॥ VI - 82

పూర్వజన్మ కర్మలను బట్టి వర్ణనిర్ణయం జరిపే పక్షంలో అది వృక్షజాతుల్లాగా నియమితమై వుండాలి.

పనసో మధురం ధత్తే ఫలమామ్లఞ్చ తిన్త్రిణీ ।
హారీతకీ కషాయఞ్చ తత్తత్కాలే స్వభావతః ॥ VI - 83

పనస చెట్టు తీయటి పండునిస్తుంది. చింతకాయ ఎప్పుడూ పులుపే. కరకచెట్టు సదా వగరే. ఆ వృక్ష జాతుల్లాగానే మానవ జాతులు గూడ నియమితమయ్యే పక్షంలో బ్రాహ్మణులందరూ సత్త్వగుణ ప్రధానులుగా వుండాలి.

సత్త్వాదిగుణ సద్భావశ్చతుర్వర్ణేషు దృశ్యతే ।
అతో జాతిర్గుణైర్జ్ఞేయా జన్మనా నేతి ఘుష్యతామ్ ॥ VI - 80

చతుర్థ వర్ణస్థులందరూ నీచగుణవంతులుగానే వుండాలి. అలా లేదు గదా ! అన్ని వర్ణాల్లోనూ అన్ని రకాలవారు వున్నారు కదా ! అందువల్ల జాతి గుణమూలమే కాని, జన్మమూలం కాదని స్వాములవారు ఘోషించారు. ఇతరులను కూడా ఘోషించమన్నారు.

సన్త్యత్ర విషయే వేదశాస్త్రయుక్త్యనుభూతయః ।
లక్షశః కిన్తు విజ్ఞానామాల మేతైరుదాహృతైః ॥ VI - 81

ఈ విషయంలో అనేక వేదశాస్త్ర ప్రమాణాలున్నాయి. విజ్ఞులకు ఈ చెప్పిన ప్రమాణాలు చాలు. జాతిద్వేషం నుండి విముక్తి పొందాలంటే స్వాములవారి సిద్ధాంతమే శరణ్యం.

## స్త్రీవిద్య :

భారతీయం సంప్రదాయంలో సరస్వతీదేవి వాగ్దేవతగా ఆరాధింపబడుతున్నది. ఇప్పటికీ మనం ఆమెను చదువుల తల్లిగానే పూజిస్తున్నాం. వేదవాఙ్మయంలో చాలామంది నారీమణుల పేర్లు వినవస్తాయి. యోగ జ్ఞానమార్గాలలో ఆరితేరిన యోగినులు, జ్ఞానఖనులు నాటి స్త్రీలోకంలో ఎందరో వున్నట్లు తెలుస్తున్నది. కాని ఏ కారణం వల్లనో మధ్యకాలంలో భారత దేశంలో 'స్త్రీలకు విద్యాధికారం లేదు' అన్న మూఢవిశ్వాసం బలపడింది. అపరావిద్య, పరావిద్య అని విద్య రెండు రకాలు. బ్రహ్మ విద్యను పరా విద్య అంటారు. ఇతర విద్యలకు అపరా విద్య అని పేరు. ఈ రెండు రకాలైన విద్యల్లోను వనితలకు ప్రవేశం లేకుండా పోయింది. శూద్రులకు, స్త్రీలకు, వేదాధికారం లేదనే శాసనాలు ఉద్భవించాయి. ఈ శాసనాలకు ఆధారం శ్రుతిలో ఎక్కడా కనిపించదు. స్మృతుల్లో

మాత్రమే ఇలాంటి శాసనాలు కనిపిస్తున్నాయి. పరిశోధకులు దీనికి చారిత్రకంగా కొన్ని కారణాలను చెప్పడానికి ప్రయత్నిస్తుంటారు. ఏది ఏమైనా రాజుల కాలంలో శ్రుతి విరుద్ధాలైన స్మృతులు కూడా చెల్లుబాటయ్యాయి. ఆంగ్లేయుల పరిపాలన రాకతో ఇక్కడ విజ్ఞాన వికాసానికి అవకాశం ఏర్పడింది. మూఢ విశ్వాసాలను విద్యావంతులైనవారు ప్రశ్నించడం ప్రారంభించారు. ఆర్యసమాజ స్థాపకులు దయానందులు, బ్రహ్మసమాజ స్థాపకులు రాజారామ్ మోహన్‌రాయలు మొదలైనవారు కొందరికి వేదాధికారాన్ని నిషేధించే శాసనాలను, సతీసహగమనాది దురాచారాలను నిర్ద్వంద్వంగా ఖండించారు. ఆంగ్ల పరిపాలకుల సహాయంతో కొన్ని దురాచారాలను చట్టబద్ధంగా ఎదుర్కొన్నారు. దేశంలో ఎంతో మార్పు వచ్చింది. ఆంధ్రదేశంలో కూడ శ్రీ కందుకూరి వీరేశలింగం పంతులు మొదలైనవారు స్త్రీవిద్య, వితంతు వివాహాలు మొదలైన విషయాలలో జోక్యం చేసుకొని విప్లవాత్మకమైన మార్పులు సాధించారు.

స్మృతికర్తలు స్త్రీలకు వేదాధికారాన్ని నిషేధించినా, లౌకిక విద్యను నిషేధించినట్లు ఆధారాల్లేవు. అయినా మామూలు విద్యకూడా స్త్రీలకక్కరలేదు అన్నభావం ప్రజలలో ఏర్పడింది. విద్యాభ్యాసంలో పురుషులకున్న అవకాశం స్త్రీలకు లేకుండాపోయింది. నేటికీ పురుషులతో పోల్చిచూస్తే విద్యావతులైన స్త్రీల సంఖ్య తక్కువే. లౌకిక విద్యల విషయమే ఇట్లున్నపుడు, ఇక బ్రహ్మవిద్యా విషయమై ఏమి చెప్పాలి ? ''శూద్రుడు వేదం గుర్తుంచుకొంటే వాని శరీరాన్ని రెండు ముక్కలుగా చేయాలని, వేదం వల్లివేస్తే వాని నాలుక కోయాలనే'' ఘోర శాసనాలు స్మృతుల్లో ఏర్పాటయ్యాయి. దీని ఫలితంగా చతుర్థవర్ణస్థులు, స్త్రీలు బ్రహ్మ విద్యకు అనర్హులుగా పరిగణింపబడ్డారు.

శ్రీ మలయాళ స్వాములవారు తమ ''శుష్కవేదాంత తమో భాస్కరము'న్న గ్రంథంలో మహిళలకు బ్రహ్మ విద్యాధికారం వున్నదని అనేక ప్రమాణాల్తో నిరూపించారు. గీతాపారాయణాది కార్యక్రమాలలోనూ, సనాతన వేదాంత జ్ఞాన సభల్లోనూ స్త్రీలకు విశిష్ట స్థానం కలిగించారు. ఎంత చెప్పినా, ఏమి చేసినా సమాజంలో ఏదో ఒక మూల దురభిప్రాయాలు, మూఢవిశ్వాసాలు చలామణి అవుతూనే వుంటాయి. అందువల్ల సమూలంగా పై సంకుచిత భావాలను

నిర్మూలించడానికి తమ పేరుతో వెలయించిన గీతలో కూడా 'స్త్రీ విద్యాధికారయోగం' పేరుతో ఒక పూర్తి అధ్యాయాన్ని కేటాయించారు. ఈ నిరూపణలో శాస్త్రవాదంతోపాటు హేతువాదాన్ని కూడా జోడించారు. అర్హతలేదన్న వాదాన్ని పెక్కు ప్రమాణాలతోనూ ఉదాహరణలతోనూ ఖండించారు.

వ్యాధిగ్రస్తా యథావిప్రాశ్శూద్రా నార్యాదయోపివా ।
అర్హన్త్యౌషధ మత్యన్తం తద్వద్బ్రహ్మాధికారితామ్ ॥ V - 3

ఆరోగ్యవంతునికి మందుతో పనిలేదు. రోగం కలవాడు ఔషధం సేవించి తీరాలి. ఈ జాతి, ఆ జాతి అనే తేడాలేకుండా అన్ని జాతులవారికి రోగాలు వస్తుంటాయి. ఆరోగ్యానికి తగిన మందును అందరూ సేవించవలసిందే. ఒక రోగాన్ని కుదిర్చే మందును ఒక జాతివాడే సేవించాలి. మరొక జాతివాడు సేవించకూడదు అనే నియమం లేదు. అలాంటి నియమం వుందని ఎవరైనా చెబితే వాణ్ణి పిచ్చివాడి కింద జమకట్టాలి. అలాగే అజ్ఞానమనేది ఒకరోగం. దాన్నే భవరోగమంటారు. అది జాతిభేదం లేకుండా అందర్నీ పీడిస్తున్నది. బ్రహ్మవిద్య ఒక్కటే దానికి తగిన మందు. అందువల్ల శరీర రోగానికి అనుగుణమైన ఔషధం సేవించినట్లే భవరోగానికి తగిన బ్రహ్మవిద్యను అధ్యయనం చేసే అధికారం అందరికీ వున్నదంటారు స్వామి.

సర్వేషామపి జన్తూనామాయుర్వేదో యథాసమః ।
ఈశ్వరోపాసనే జ్ఞానే తథాసర్వాధికారితా ॥ V - 5

ఆయుర్వేదానికి పక్షపాతం లేదు. అది అందర్నీ సమానంగా చూస్తుంది. ఇక వేదానికి మాత్రం పక్షపాతమెందుకు ? వేదప్రతిపాదితమైన ఈశ్వరోపాసన, జ్ఞానం ఇత్యాదులతో ఫలానా వారికి అధికారం లేదు అని చెప్పడమెందుకు ? ఇది చక్కని హేతువాదం. చక్కగా ఆలోచిస్తే శాస్త్రవాదం కూడా ఇదే. సంకుచిత దృష్టిలేనివాడు ఈ ధోరణిలోనే ఆలోచిస్తాడు.

భుక్తౌషధో ఽపి నిష్పథ్యో రోగశాన్తిం న విన్దతి ।
తథా శమాది సంత్యక్తా లబ్ధబ్రహ్మోపదేశికాః ॥ V - 6

స్త్రియో విప్రాస్తథా శూద్రా భవరోగాన్వితా పున ।
నాధిగచ్ఛన్తి నిర్వాణం పరం బ్రహ్మాద్వయం శివమ్ ॥ V - 7

ఔషధం సేవించినా కొందరికి రోగం కుదరక పోవచ్చు దానికి కారణం పథ్యంలో లోపమే అంతేగాని జాతి కారణం కాదు ఏ వర్ణం వారైనా బ్రహ్మ విద్యను అభ్యసించి కూడా శమదమాది గుణాలు లేనివారైతే వారి భవరోగం శమించదు ఇక్కడ జాతి ప్రస్తావనకు ఆస్కారం లేనేలేదు

మరొక విషయాన్ని కూడా ఇక్కడ గ్రహించాలి ఇతర విద్యల నభ్యసించేవారు ఆ విద్యలకనుగుణంగా ప్రవర్తించకపోయినా పరవాలేదు కాని బ్రహ్మవిద్య అలా కాదు బ్రహ్మ విద్యాభ్యాసి దాని ఫలితం తప్పక పొందాలంటే విధిగా సాధన చతుష్టయ సంపత్తి కలిగివుండాలి సదాచార సదనుష్ఠానాలు లేకపోతే ముక్తి లభించదు 'నావిరతో దుశ్చరితాత్ నాశాంతో నా సమాహితః దుశ్చరిత్రం నుండి విరమించని వాడు శాంతి లేనివాడు, సమాధిస్థితి లేనివాడు బ్రహ్మమును పొందలేడు అని శ్రుతులు ఈ విషయాన్ని నొక్కివక్కాణించాయి అందుచేత బ్రహ్మవిద్యాఫలం సాధకుని ప్రవర్తన మీద ఆధారపడి వుంటుంది కాని వాని జాతి మీద వర్ణం మీద లింగం మీద ఆధారపడి వుండదు స్వాములవారు ఈ విషయాన్నే ధృడంగా బలపరిచారు

ప్రారబ్ధ మనుభవించే వానికి అనన్యభక్తి ఎలా ఉపకరిస్తుంది అని భూదేవి విష్ణువును అడిగినట్లు వరాహపురాణంలో వుంది అప్పుడు భగవంతుడు "ప్రారబ్ధమనుభవిస్తున్నా గీతను అభ్యసించేవాడు గీతోక్తధర్మాలను పాటించేవాడు ముక్తాత్ముడే" అని సమాధానం చెబుతాడు గీత మహాత్మ్యాన్ని పెక్కు విధాల కీర్తిస్తాడు గీత బ్రహ్మవిద్య కదా ! స్త్రీలకు బ్రహ్మవిద్యాధికారం లేకపోతే విష్ణువు భూదేవితో గీతా పఠనాన్ని గురించి ఎందుకు చెబుతాడు ? ఇంకా పురాణాల్లో శివుడు పార్వతికి బ్రహ్మోపదేశం చేసినట్లు చదువుతూ వుంటాం భూదేవి పార్వతి స్త్రీలై వుండి కూడా విష్ణువు నుండి పరమేశ్వరుని నుండి అలాంటి ప్రబోధం పొందారు ఇక స్త్రీలకు బ్రహ్మవిద్యాధికారం లేదని ఎలా చెప్పగలం ? యాజ్ఞవల్క్యుడు మైత్రేయికి బ్రహ్మ విద్యోపదేశం చేసినట్లు బృహదారణ్యకం లో కనిపిస్తుంది అందువల్ల స్త్రీలకు బ్రహ్మ విద్యాధికారం లేదన్నమాట శ్రుతి సమ్మతం కాదు శాస్త్ర సమ్మతం కాదు హేతువాదానికి నిలబడదు

స్త్రీలకు బ్రహ్మచర్యంలోనూ, సన్న్యాసంలోనూ అధికారం లేదనే మరొక ప్రశ్నకు స్వామి ఇలా సమాధానం చెప్పారు.

కేవలం శాస్త్రవిద్వాక్యం నగ్రాహ్యమనివార్యతః ।
సుగ్రాహ్యం సర్వదా వాక్యమాత్మవిచ్ఛాస్త్రవేదినః ॥ V-14

కేవలం శాస్త్రవేత్తలు, శాస్త్రజ్ఞానంతో పాటు ఆత్మజ్ఞానం కలవారు అని రెండు రకాల మనుషులున్నారు. ఇందులో రెండవ తెగవారి మాటలు మాత్రమే ప్రామాణికాలు మొదటి తెగవారి మాటలు ప్రమాణం కావు. సర్వత్ర బ్రహ్మభావం కలిగినవారి మాటలు మాత్రమే గ్రహించాలి. భేద బుద్ధి కలిగినవాడు బ్రహ్మజ్ఞుడు కాడు గనుక అటు వంటి వాని మాటలను గ్రహించకూడదు. ప్రాచీన భారతంలో పేరు బడసిన నారీ శిరోమణుల్ని పేరుపేరునా జ్ఞాపకం చేస్తారు స్వాములవారు.

గార్గ్యాశ్చ సులభాయాశ్చ చరిత్రం నానుశ్రూయతే ।
సంన్యాస బ్రహ్మచర్యాది సద్గుణైరుజ్జ్వలం మహత్ ॥ V - 18

గార్గి, సులభ మొదలైన స్త్రీలు బ్రహ్మచర్య సన్న్యాసాశ్రమాలను పాటించారు. ఖ్యాతి కలిగి జీవించారు.

వాసిష్ఠే కిల చూడాలా బ్రహ్మజ్ఞా చ మదాలసా ।
గార్హస్థ్యేపి చ తత్త్వజ్ఞా బ్రహ్మలేభే పరంశివమ్ ॥ V - 24

చూడాల బ్రహ్మజ్ఞానంతో ప్రకాశించింది. ఆమె తన భర్త శిఖిధ్వజునికే గురుత్వం వహించింది. మదాలస తన కొడుకులను బ్రహ్మజ్ఞులుగా తీర్చిదిద్దింది.

ఏవం కాత్యాయనీ శార్ఙ్గీ సులభావిశ్వవరాతథా ।
తపస్వినీచ మైత్రేయీ శ్రూయతే బ్రహ్మభాగినీ ॥ V - 25

కాత్యాయిని, మైత్రేయి మొదలైన మహిళా మణులందరూ బ్రహ్మజ్ఞానం కలవారని ఆర్షవాఙ్మయం పేర్కొంటుంది. అందుచేత స్త్రీలకు బ్రహ్మవిద్యాధికారం లేదనే మాటలో పస లేదు. అలాగే వారికి ఆశ్రమాల నియమం కూడా వున్నట్టు అగుపించదు. ఎందుకంటే ?

గార్గీ చ బ్రహ్మచారిణ్య శ్చూడాలాం చ గృహస్థకాః ।
వానప్రస్థాశ్చ మేత్రేయీాం ప్రవ్రజాస్సులభాం తథా ॥ V - 27

గార్గి బ్రహ్మచారిణి, చూడాల గృహస్థురాలు, మైత్రేయి వానప్రస్థురాలు, సులభ సన్న్యాసిని వీరు నలుగురూ ముక్తాత్మలే. ఆశ్రమ భేదం లేకుండా స్త్రీలు కూడా మోక్షార్హులే అటువంటి వారికున్న అధికారం ఇతర స్త్రీలకు ఎందుకుండకూడదు. కాన స్త్రీలు పై వారిని ఆదర్శంగా స్వీకరించాలి.

యాదృశీ భావనా తీవ్రా సిద్ధిర్భవతి తాదృశీ ।
శంకరోఽప్యవదత్పూర్వం భేజే భ్రమరకీటవత్ ॥ V - 29

మన భావననుసరించే ఫలం లభిస్తుంది. ఆత్మోన్నతిని సాధించగల మన్న భావంతో, దృఢ నిశ్చయంతో స్త్రీలు పాటుబడితే తప్పక వారు ఆత్మోన్నతిని సాధించి తీరుతారు. దీనినే శాస్త్రాలు భ్రమరకీటక న్యాయమంటారు.

అనాత్మ భావనా బన్ధాదాత్మ భావనయా పునః ।
ముక్తస్సుఖీ భవేద్ధీమాన్ పంజరాదివకేసరీ ॥ V - 30

అనాత్మ భావన అనే పంజరం నుండి బయటపడాలంటే ఆత్మభావన కలిగి వుండాలి. ''నేను సుఖిని అనుకొనేవాడు సుఖమే పొందుతాడు. నేను దుఃఖిని అనుకొనేవాడు దుఃఖమే పొందుతాడు''. కాబట్టి భావననుసరించే ఫలముంటుందని స్వామి అభిప్రాయం.

విద్యాధిదేవతా వాణీ ధనాధ్యక్షా చ పద్మజా ।
పార్వతీ జ్ఞానరూపా చ ర్వా అపి స్త్రియఃఖలు ॥ V - 31

విద్యాధిదేవత సరస్వతి, ధనదేవత లక్ష్మి జ్ఞానదేవత పార్వతి వీరందరూ స్త్రీలేకదా! వారికాయోగ్యత ఎలా వచ్చింది ? కృషిచేస్తే ఇప్పటివారికి మాత్రం ఎందుకు రాదు ?

కథం బుద్ధేర్వికాస స్స్యాన్మం జూషాష్ఠిత బీజవత్ ॥ VI - 37

విత్తనాన్ని డబ్బాలో పెట్టి మూతపెడితే మొలకెత్తదు నేలలో విత్తి నీరు పోస్తే అంకురిస్తుంది అవకాశం కలిగిస్తే అందరూ వికాసం పొందుతారు అవకాశం లేకపోతే ఎవరికీ ఆత్మోన్నతి లేదు ఇక్కడ వికాసానికి అవకాశమే కారణం కాని లింగం కాదు అందువల్ల స్త్రీలకు అధికారం లేదనే మాట నిరర్థకమైనది

బ్రహ్మోచ్యుతాదయస్సర్వే నారీ వాణీ పరాయణా ।
ప్రాప్తజ్ఞానా బభూవుస్తే మాతర్భీతి కుతస్తవ ॥ V - 34

బ్రహ్మాదులే సరస్వతినుపాసించి జ్ఞానవంతులయ్యారు ఇక నేటి స్త్రీలు జ్ఞానప్రాప్తికై కృషి చేయడానికి ఎందుకు భయపడాలి నేటి స్త్రీలలో జాగరూకత ఎందుకు లేకుండా పోయింది? వారికెందుకీన్యూనతా భావం ? అనే సందేహాలకు స్వామి ఇలా సమాధానం చెబుతారు

సుప్తసింహో యథా శక్తిం స్వీయాం వై నావగచ్ఛతి ।
మాయానిద్రాగతో జన్తుర్నైవ దివ్యాం ప్రభాం తదా ॥ V - 35

సింహానికైనా నిద్రలో వున్నప్పుడు దాని శక్తి దానికి తెలియదు లోకంలో ప్రాణులు అందరూ మాయ అనే నిద్రలో వున్నారు అందువల్ల తమదివ్య శక్తులు వారికి గోచరం కావటం లేదు

నిగూఢా స్వాత్మశక్తిశ్చ ప్రబుద్ధా భవతి నిష్కలా ।
ప్రభూతే హ్యాత్మబోధే చ త్యక్త బన్ధస్సదాసుఖీ ॥ V - 36

' ఆత్మ జ్ఞానమనే సూర్యుడుదయిస్తే అజ్ఞానమనే నిద్ర తొలిగి పోతుంది అపుడు 'నాది, నేను' అనే అహంకార మమకారాల్ల కలలు విచ్ఛిన్నమైపోతాయి అంతవరకూ నిగూఢంగా వున్న ఆత్మశక్తి ప్రబుద్ధమౌతుంది ఇక్కడ లింగభేదంతో పనిలేదు ప్రయత్న భేదం తప్ప మరేమీ అక్కరలేదు అని నొక్కి వక్కాణించారు అన్ని ధర్మాలకు ప్రమాణమైన మనుస్మృతి మాతృస్థానం గొప్పదని సర్వశ్రేష్ఠమని చెప్పుతున్నది మాతృదేవోభవ అని శ్రుతి కూడా శాసించింది అంతే కాకుండా స్త్రీలను పురుషులను కలిపి చెప్పేటప్పుడు ముందు స్త్రీలనే పేర్కొనడం మన సంప్రదాయం ఉదాహరణకి

మాతాపిత్రు శివైర్లక్ష్మీనారాయణ పదై స్ఫుటమ్ ।
నామాదౌ కీర్తనాత్ స్త్రీణాముత్కర్షో బహుమన్యతే ॥ V - 40

లక్ష్మీనారాయణులు, పార్వతీ పరమేశ్వరులు, యధార్థం ఇలా వుంటే సమాజంలో స్త్రీల స్థానాన్ని తక్కువ చేయటానికి ప్రయత్నించడం ఎంత సమంజసమో ఆలోచించ మంటారు స్వామి

కించ శ్రీరామకృష్ణాది నిమిత్త ప్రభవా పురా ।
బుద్ధశ్రీ యేసునిబ్యాది గాన్ధ్య న్తా స్తత్త్వదర్శిన. ॥ V - 41
మధ్వశ్రీ శంకరాచార్య ప్రవక్తారశ్చ లేభిరే ।
జన్మస్త్రీ గర్భవివరే కధం హీనా స్త్రియశ్శుభే ! ॥ V - 42
పూతగర్భాశ్చ హే మాత స్తత్త్వజ్ఞోదయ హేతవ ।
పూత బ్రహ్మ విచారే హి నార్యోஉనర్హా॰ కధం వద ॥ V - 43

మనం గొప్పవారుగా భావించిన శంకరాది ప్రాచీన ఆచార్యులు, మత ప్రవక్తలు, గాంధీలాంటి ఆధునిక మహనీయులు అందరూ స్త్రీల గర్భం నుండి పుట్టినవారే వీరు గొప్పవారైతే, బ్రహ్మ విద్యకధికారులైతే వీరికి జన్మనిచ్చిన స్త్రీలెందుకు గొప్పవారు కారు ? వారికి బ్రహ్మవిద్యార్హత ఎందుకు లేకుండా పోతుంది ? ఇలాంటి ఉత్తమ భావనలచేత స్త్రీలు ఆత్మోన్నతిని సాధించాలని స్వామి ప్రకటించారు

నైవస్త్రీచ పుమానేష నైవ చాయం నపుంసక ।
శరీరోత్పత్తి భేదేన తత్తల్లింగమితి శ్రుతి ॥ V - 47

''స్త్రీ పురుషాది భేదాలు ఆత్మకు లేవ''ని వేదం ముక్త కంఠంతో ఘోషించింది

దేవభావమహంభావం పరిత్యజ్య సునిర్మలే ! ।
సోహంభావేచ సంలీనా బ్రహ్మ భూయాయ కల్పసే ॥ V - 50

అందువల్ల దేహభావాన్ని, అహంభావాన్ని వదలాలి, సోహం భావంతో వుండాలి

'సత్యం జ్ఞాన' శ్రుతే రూపలక్షణం హృది ధారణాత్ ।
బ్రహ్మోహమస్మి బోధేన నిశ్చలా భవ మోక్షగా ॥ V - 51

సత్యజ్ఞానాది రూపమైన ఆత్మను మననం చేయాలి. 'అహం బ్రహ్మోస్మి' అని మహావాక్యాన్ని భావించి ముక్తి సాధించాలి.

నాహం దేహో న చ ప్రాణో నేన్ద్రియాణి మనో నహి ।
సాక్షిత్వాచ్చివ ఏవాస్మి కేవలస్సచ్చిదాత్మకః ॥ V - 52
తటస్థలక్షణం బుద్ధ్వా విచార్యేదం ముహుర్ముహుః ।
దేహాదిభావనాముక్తా బ్రహ్మభావేన దీవ్యతామ్ ॥ V - 53

ఈ భావనకు తటస్థ లక్షణ పద్ధతి పనికి వస్తుంది. నేను దేహం కాదు. ప్రాణం కాదు. ఇంద్రియాలు కాదు. మనస్సు కాదు. నేను సచ్చిదానంద స్వరూపుణ్ణి, సాక్షిమాత్రుణ్ణి, శివస్వరూపుణ్ణి అని విచారించాలి. అలాచేస్తే దేహ భావన నశిస్తుంది. అంతేకాదు 'జాగ్రద్రూపమై స్వప్నరూపమై, సుషుప్తిరూపమై కనిపించే ఈ ప్రపంచాన్ని ప్రకాశింప చేసేది బ్రహ్మమే. ఆ బ్రహ్మం నేను అన్న జ్ఞానంతో బంధాలు వదలి పోతాయి'. అక్కడ లింగ భేదం లేదు. ఇది శ్రుతి వచనం.

దృశ్యమేవ హి సాక్షిత్వం యేన బద్ధస్సు నిశ్చితః ।
అతస్త్రిపుటి రాహిత్యే పూర్ణమేవా వశిష్యతే ॥ V - 56
జ్ఞాతృ జ్ఞానజ్ఞేయ భేదః పరే నాత్మని విద్యతే ।
చిదానన్దైక రూపత్వాద్దీప్యతే స్వయమేవ తత్ ॥ V - 57

అందువల్ల స్త్రీలు న్యూనతా భావాన్ని వదిలి, శ్రుతి వాక్యాలను చక్కగా విచారించి, త్రిపుటిని నిరాకరించి ఆత్మభావంలో వుండి ముక్తులు కావాలి.

ఈ విధంగా స్వాములవారు యుక్తితో, శాస్త్రంతో, ఉదాహరణలతో, వేద ప్రమాణాలతో స్త్రీలకు బ్రహ్మవిద్యాధికారం వున్నదనే సత్యాన్ని నిర్ద్వంద్వంగా, నిశ్చప్రచంగా తమ గీతలో నిరూపించారు.

## అంటరానితనం :

హిందూ సమాజాన్ని పట్టి పీడించిన జాడ్యాలలో అంటరానితనం ఒకటి. తోటి మానవుని స్పృశించడం దోషమని సనాతనులు కొందరు భావించారు. పొరపాటున స్పృశించడం జరిగితే స్నానాది విధులు, ప్రాయశ్చిత్త క్రియలు జరుపుకొనేవారు. పశు పక్ష్యాదులను స్పృశించే మనిషి ఆ స్పర్శను దోషంగా భావించక మానవుని స్పర్శను దోషంగా ఎందుకు భావించాడు ? అనేది గడ్డు సమస్య. దీనివెనుక వున్న చారిత్రక కారణాలను ఇదమిత్థమని విడమర్చి చెప్పడం కష్టం.

స్పృశించడానికే తగడు అని భావించబడే వ్యక్తికి, ఇక సమాజంలో ఏమి గౌరవం ఉంటుంది ? అతని విద్యకు, వినోదానికి, వికాసానికి అవకాశం ఎవరు కల్పిస్తారు ? అందువల్ల అవర్ణులు సవర్ణుల నుండి వెలివేయబడ్డారు. ఊరికి దూరంగా నివసించే దుస్థితి వారికి ఏర్పడింది. వేదం బోధించిన సమత్వ సిద్ధాంతం సిద్ధాంతంగానే మిగిలిపోయింది. ఆచరణలో విషమత్వమే రాజ్యమేలింది. ఈ పరిస్థితి మరికొన్ని ప్రాంతాలలో చాలా దారుణంగా పరిణమించింది. ఉదాహరణకు కేరళలో నిమ్న జాతీయుల పరిస్థితిని, సవర్ణులు వాళ్లపట్ల చూపుతున్న అసహ్యతను స్వయంగా పరిశీలించిన వివేకానందుడు ఆ రాష్ట్రాన్ని పిచ్చివాళ్ళ నిలయం **(Lunatic Asylum)** గా వర్ణించాడు.

ఈ అంటరానితనమనేది భారతదేశంలో నిమ్నజాతీయుల జన్మను బట్టి పాటింప బడింది. వర్ణవిభాగం కూడా అలాగే చలామణీ అయ్యింది. స్వాముల వారు ఇది వేద విరుద్ధమని నిరసించారు. గుణాలను బట్టే వర్ణనిర్ణయం చేయాలని, అందుకు తగిన శ్రుతి, స్మృతి ప్రమాణాలను అన్నింటిని చూపించి, ఆ ప్రమాణాలకు యుక్తి యుక్తమైన హేతువాదాన్ని కూడా జోడించారు.

> వినైవ జన్మసంబన్ధం గుణైరాత్మని సంస్థితైః ।
> బ్రాహ్మణాది విభాగోయం శ్రుతిస్మృతి నిరూపితః ॥ VI - 71

అని ఎలుగెత్తి చాటారు. భగవద్గీతలో 'గుణకర్మవిభాగశః', 'స్వభావప్రభవైర్గుణైః' అనే మాటలు జన్మజాతి వాదాలకు విరుద్ధాలని, గుణాలతో

మాత్రమే మానవులను విభజించాలనే వాదన హిందూ సమాజంలోనే కాక విశ్వమంతటా వున్నదని ఉద్ఘోషించారు జన్మతో కులం లేదన్నప్పుడే అస్పృశ్యతా వాదం కుప్పకూలి పోయింది అంటరానితనం వల్ల కలిగిన గొప్ప అనర్థాన్ని జ్ఞాపకం చేస్తూ

తస్మాద్విద్యా తపోభ్యాం హి పూతాత్మేతి శ్రుతేర్వచః ।
రుద్ధ విద్యాతపోధ్యానా జనావృద్ధిం నలేభిరే ॥ VI - 28

ఏవం నిషిద్ధాస్స్వమతే సుఖమప్రాప్యతే జనాః ।
మతాన్తరం సమాలమ్బ్య సంజాతా యవనాదయ ॥ VI - 29

సమస్తం భారతం దేశం మతద్వేషైఖండయన్ ।
హైన్దవానాం మతం తస్మాద్బల హీనమజాయత ॥ VI - 30

నిరోధకా నరా అన్తే స్వాత్మశక్తి విహీనతామ్ ।
గతాస్సమ్పాలితాశ్చాన్యైర్విదేశీయై కుశాసకై. VI - 31

సోదర మానవులచే హీనంగా చూడబడిన అంటరానివారు క్రమంగా ఇతర మతాల్లో కలిసిపోయారు ఇతర మతస్థులు చూపిన ప్రలోభాలు కూడా ఇందుక్కారణమయ్యాయి ఆర్ష ధర్మానికే ఇందువల్ల ముప్పు ఏర్పడింది విద్యా తపస్సులు మానవుణ్ణి పవిత్రుణ్ణి చేస్తాయని శ్రుతి చెప్పింది అంటరానితనం హిందూ సమాజంలో కోట్లకొలది ప్రజలను విద్యా తపస్సులకు దూరం చేసింది హిందూమతంలో వారికి సుఖం లభించలేదు ఇతర మతాలవారు వారి వారి మతాన్ననుసరించి దైవతత్త్వం వారికి బోధించారు ధనాది ప్రలోభాలకు కూడా ఎరగాబడ్డారు అందువల్ల కోట్లకొలది ప్రజలు ఆర్షధర్మాన్ని వదలి ఇతర మతాల నాశ్రయించారు ఒకవిధంగా ఇది హిందూమతానికే ముప్పు కలిగించింది దాని దుష్ఫలితాలను ఇపుడు సమాజంలో చవి చూస్తూనే వున్నాం అని స్వామి చెప్పారు

యోగ్యతాం హి సమాలక్ష్య
యోగ్యాయ స్థానమున్నతమ్ ।
యస్మిన్ దేశే న దీయేత
స దేశో నంక్ష్యతి ధ్రువమ్ ॥ VI - 23

యోగ్యతాం వీక్ష్యయస్మైచి
త్కస్మైస్థానం సమున్నతమ్ ।
యస్మిన్ దేశే ప్రదీయేత
సో ఽచిరాద్వృద్ధి మేష్యతి ॥ VI - 24

ఏ దేశంలో యోగ్యతను గుర్తించి యోగ్యుడైన వారికి వుచిత స్థానమివ్వరో ఆ దేశం నశిస్తుంది. ఏ దేశం యోగ్యత గుర్తించి గౌరవిస్తుందో అది వృద్ధి పొందుతుంది.

అధః కర్తుం పరాన్ యస్తు సమీహేత దురాగ్రహాత్ ।
అధః క్రియేత సోప్యన్యై రిదమీశ్వర శాసనమ్ ॥ VI - 33

ఇతరులను అణగద్రొక్కాలని ప్రయత్నించేవాడు తప్పకుండా ఇతరులచే అణగ ద్రొక్కబడతాడు. స్వామీజీ ఇంకా ఇలా చెప్పారు.

వ్యాధి గ్రస్తాయథా విప్రాశ్శూద్రా నార్యాదయోపి వా ।
అర్హన్త్యౌషధ మత్యన్తం తద్వద్బ్రహ్మోధి కారితామ్ ॥ V - 3

రోగం కలవాడికి మందుగాని, ఆరోగ్యం కలవానికక్కరలేదు. అలాగే సమాజంలో హీనస్థితిలో వున్నవానికే చదువు, సంస్కారం అవసరం. ముఖ్యంగా భగవద్ధర్మాన్ని, ఆత్మధర్మాన్ని అలాంటి వాడికే బోధించాలి. కాని భారతదేశంలో జరిగిందేమిటి ? సమాజంలో అడుగున పడినవారిని ఇంకా అణగ ద్రొక్కటానికే ప్రయత్నం జరిగింది కాని, ఉద్ధరించటానికి ప్రయత్నం జరగలేదు స్త్రీలకు, శూద్రులకు, అంటరానివారికి వేదాధికారం, విద్యాధికారం, ఓంకారోచ్చారణాధికారం లేదని కొన్ని స్మృతులు చెప్పాయి. ఇదెలా వున్నదంటే రోగికి మందులు పని లేదన్నట్లున్నది. ఈ స్థితిని స్వాములవారు బాహాటంగా తమ రచనల్లో, ప్రవచనాల్లో అనేకచోట్ల ఖండించారు.

అధ్యయనస్య సామర్థ్యే నావకాశో భవేద్యది ।
కథం బుద్ధేర్వికాసస్స్యాన్మం జూషస్థిత బీజవత్ ॥ VI - 37

బీజాన్ని డబ్బాలో పెట్టి మూతపెడితే మొలకెత్తదు. పొలంలో విత్తి, దోహదక్రియ చేస్తే అంకురిస్తుంది. అలాగే ఏ వ్యక్తినైనా సంస్కారవంతుణ్ణి చేస్తే ఆత్మోన్నతి పొందుతాడు. సంస్కారానికవకాశం లేకుండా చేస్తే, రాణించడన్నది స్వామి సిద్ధాంతం. వారు స్థాపించిన విద్యాలయాల్లో చదువుకున్న అన్ని జాతులవారు, స్త్రీలు ఉన్నత స్థితిని సాధించగలిగారు. ఇందుకు కారణం సంస్కారానికవకాశం కల్పించటమే.

ఒకసారి హరిజనులు ఆశ్రమానికి వచ్చి, తమస్థితి చక్కబడటానికి తరణోపాయం తెలపమని ప్రార్థిస్తే, స్వాములవారు ''హిందువులు గోవును పవిత్రంగా భావిస్తారు. గోమాంస భక్షకులను సహజంగా ఈసడించుకొంటారు. అందువల్ల అవర్ణులు తమ తిండి తీర్థాదుల్లో మార్పు చేసుకోగలిగితే సవర్ణులతో సమాన స్థితిని పొందటానికి అది దోహదపడుతుంద''ని వివరంగా నిరూపించారు. ఆ సందర్భంలో అవర్ణులడిగిన అనేక ప్రశ్నలకు కూడా స్వాములవారు శాంతియుతంగా సమాధానాలు చెప్పినారు.

బంగారు భగవంతుని సృష్టి, ఆభరణాలు మానవుని సృష్టి, మానవుడు భగవంతుని సృష్టి. కులాలు మానవుని సృష్టి అని స్వామి అన్నారు. కాబట్టి అస్పృశ్యతాది దురాచారాలు కూడా మానవులు సృష్టించుకొన్నవే. ఏ దేవుడో వచ్చి వీటిని చక్కబరచలేడు. ''ఉద్ధరేదాత్మ నాత్మానం'' అని కృష్ణుడు అన్నట్లు మానవుడు తననుతానే వుద్ధరించుకోవాలి. తన జాతిని తానే ఉద్ధరించుకోవాలి. విజ్ఞాన వికాసాదులు లేని ఏ అంధయుగంలోనో పాటించినవి అస్పృశ్యతాది దురాచారాలు. సృష్టి క్రమంగా వికసిస్తున్నది. విజ్ఞానకాంతులు అజ్ఞానాంధకారాన్ని దూరం చేస్తున్నాయి. ఈ రోజుల్లో కూడా మూఢ విశ్వాసాలను బట్టుకొని ప్రాకులాడేవాడు నిజంగా మానవుడేనా ? అందుకే శ్రీ మలయాళస్వాములవారు మలయాళ యతీంద్ర గీతలో, జాతి నిర్ణయ యోగంలో జాతుల పుట్టు పూర్వోత్తరాలను నిర్ణయించేటప్పుడు అంటరానితనం మొదలైన దురాచారాల్ని అటువేదానికి, ఇటు యుక్తి యుక్తత్వానికి, సమాజ శ్రేయస్సుకు ప్రత్యక్ష విరుద్ధాలని అనేక ఉదాహరణలతో, పెక్కు ప్రమాణాలతో నొక్కివక్కాణించారు.

శ్రీ స్వాములవారి విప్లవాత్మక భావాలు కేవలం ప్రసంగాలకు, బోధనలకు

పరిమితం కాలేదు. ఆరంభం నుండి వారు కార్యక్షేత్రంలో తమ భావనలు రూపుదిద్దుకోవడానికి కృషిచేశారు.

శ్రీ మలయాళ స్వాములవారు తిరుమలలో వున్నపుడు, సమాజ సంస్కరణపరమైన వారి భావాలు నచ్చక కొండనుండి వారిని పంపివేయటానికి ఒకవర్గం తీవ్రకృషి చేసింది. స్వాములవారు కూడా కొండదిగడమే శ్రేయస్కరమని భావించారు. ఎందుకంటే అప్పటికి హరిజనులకు తిరుమల ఆలయంలో ప్రవేశం లేదు. స్పృశ్యులు, అస్పృశ్యులు అనే తేడా లేకుండా ఆత్మోన్నతి పొందడానికి అవసరమైన శిక్షణను అందరికీ ఇవ్వాలని ఆశించిన స్వాములవారు కొండదిగి, ఏర్పేడు వద్ద వ్యాసాశ్రమం స్థాపించి అక్కడ సమత్వ సిద్ధాంతాన్ని ఆచరణలో పెట్టారు. విద్యాలయంలో, భోజన భాజనాదులలో, వేదాంత సభలలో అంటరానితనం పాటించకుండా అన్ని వర్గాలకు సమానావకాశం కలిగించారు.

**నిమ్నస్థితి మతాం పుంసామున్నత స్థితిగామినామ్ ।**
**నిరోధో నైవకర్తవ్యో నాస్మిన్ పాపం భవిష్యతి ॥** VI - 66

నిమ్న స్థితిలో వుండేవారికి ఉన్నత స్థితిని అందుకోవటానికి అవకాశం కల్పించాలేకాని ఏ విధంగానూ వారి అభివృద్ధిని నిరోధించరాదన్నది స్వాములవారి సిద్ధాంతం. అంటరానివారికి అవకాశం కలిగించడం నేరమనే శాస్త్రాలను, పాపమనే వాదాన్ని వారిక్కడ నిర్ద్వంద్వంగా ఖండించారు.

## యుగనిర్ణయం :

శ్రీ మలయాళ యతీంద్రులు తమ గీతలో ప్రస్తావించిన విషయాలలో యుగ నిర్ణయం చాలా విశిష్టమైనది.

భారతీయులకు అనాదిగా వున్న యుగాలను గూర్చిన ఒక భావన విశ్వాసం మీద ఆధారపడి వుంది. నేటి కాలం కలియుగమని, ఇందులో పాపమే ఎక్కువగా వుంటుందని, ధర్మానికి పెద్దగా చోటులేదని అనేకులు భావిస్తారు. పండితులు కూడా కాల ప్రభావాన్నే గొప్పగా చిత్రిస్తున్నారు. కలికాలం దోషభూయిష్ఠమనేది వారి వాదన. ఈ భావన ''కలికాలంలో దోషం లేకుండా జీవించలేము'' అనే తప్పుడు అభిప్రాయాన్ని కలిగిస్తుంది. ఈ అభిప్రాయం దోషాచారులకు స్వేచ్ఛనిస్తుంది. ఇందువల్ల వారు పతనం కావడమేకాక, ఇతరుల పతనానికి కూడా

వారు కారణమౌతారు. 'యద్భావం తద్భవతి' అన్నట్లు 'కలి, కలి, కలి' అని జపించేవాడు తప్పకుండా కలి ప్రభావానికి గురౌతాడు. బుద్ధిపూర్వకంగా తప్పిదాలు చేసేవారు కూడా ఇది కలికాలమని చెప్పి తప్పించుకోవటానికి ప్రయత్నిస్తారు. ఇందువల్ల ప్రజల ఆత్మోన్నతికి ఆటంకం కలుగుతుంది. ఈ దుస్థితి తగదని చెప్పటానికే స్వాములవారు తమ గీతలో 15వ అధ్యాయాన్ని 'యుగనిర్ణయాని'కే కేటాయించారు. అనేక యుక్తులతో, వివిధ ప్రమాణాలతో సహేతుకంగా యుగాలమీద ప్రజలకున్న ఇప్పటి నమ్మకం నిరాధారమని, ఇది సమాజ పతనానికి దారి తీస్తుందని నిరూపిస్తూ ఇలా అంటారు.

కాలం ఎప్పుడు ఒకే విధంగా వుంటుంది. సమాజం మానవుల ప్రవృత్తులు మారుతూ వుంటాయి. ప్రవృత్తి మంచిదైతే అది కృతయుగానికి సంకేతమౌతుంది. చెడు ప్రవృత్తి కలియుగానికి సంకేతం. అందువల్ల కాలం వల్ల ప్రవృత్తులు మారవని, ప్రవృత్తి భేదం వల్ల కాలభేదాన్ని కల్పించుకొని యుగనిర్ణయం జరిగిందని భావించాలి.

యుగతత్త్వం సామాన్యులకు అర్థంకాదు. వివేకవంతులు మాత్రమే సనాతన ధర్మశాస్త్రాల ననుసరిచి ఈ తత్వాన్ని గుర్తింపగలుగుతారు.

> యుగాన్యుద్దిశ్య శాస్త్రేషు ద్విధా ప్రోక్తం మహర్షిభిః ।
> సత్త్వాది గుణ భేదేన సత్యాది యుగ భేదతః ॥ XV - 3

మహర్షులు సత్త్వాది గుణభేదంతోనూ, సత్యాది యుగ భేదంతోనూ యుగాల్ని రెండుగా విభజించినారు.

> కాలో వా కారణం రాజ్ఞో రాజా వా కాల కారణమ్ ।
> పృష్టో భీష్మో జగాద్దైవం రాజా కాలస్య కారణమ్ ॥ XV - 1

రాజుకు కాలము కారణమా ? కాలానికి రాజు కారణమా ? అనే ధర్మరాజు ప్రశ్నకి రాజే కాలానికి కారణమని భీష్ముడు మహాభారతంలో చెబుతాడు. అలాగే -

> యుగాను సారేణ మనః ప్రవృత్తి
> ర్మనోఽనుసారేణ యుగ ప్రవృత్తిః ? ।

ప్రశ్నే సతీత్థం సుధియో వదన్తి
మనో౽నుసారేణ యుగప్రవృత్తిః ॥ XV - 12

యుగాన్ననుసరించి మనస్సు ప్రవర్తిస్తుందా ? లేక మనస్సుననుసరించి యుగం ప్రవర్తిస్తుందా ? అనే ప్రశ్నకు మనస్సుననుసరించే యుగము ప్రవర్తిస్తుందని బుద్ధిమంతులు చెబుతారు.

అసలు నాలుగు యుగాలు, వాటి స్వరూపం ఎటువంటిదో వివరిస్తూ స్వామి ఇలా అంటారు.

చతుష్పాద్ధర్మయుక్తశ్చ కాలం కృత యుగం పురా ।
త్రిపాద్యుక్తద్విపాద్యుక్తౌ త్రేతాద్వాపర సంజ్ఞకే ॥ XV - 14
ఏకపాద్ధర్మ యుక్తస్తు కాలం కలియుగం తథా ।
ఏవం సామాన్యతో విజ్ఞా యుగేషు సమవాదిషుః ॥ XV - 15

నాలుగు పాదాల ధర్మంతో కూడినది కృతయుగమని, మూడు, రెండు, ఒకటి పాదాలతో కూడినవి క్రమంగా త్రేతాయుగం, ద్వాపరయుగం, కలియుగాలని చెబుతారు.

ధర్మపాదా దయా సత్యం తపో దానమిమే గుణాః ।
యస్మిన్మహాజనే సన్తి వాసస్తస్య కృతే భవేత్ ॥ XV - 16

దయ, సత్యం, తపస్సు, దానం అనేవి నాలుగూ ధర్మ పాదాలు. ఇవి ఎవ్వనితో వుంటాయో వాడు కృతయుగ నివాసి అవుతాడు.

సత్యైక్షీణే తపో దాన దయా సహిత మానవః ।
త్రేతాయుగే నివాసీ స్యాత్రున్నష్టైకాంఘ్రి ధర్మగః ॥ XV - 17

సత్యం తప్ప ఇతర గుణాలు కలవాడు త్రేతాయుగ నివాసి.

దయాసత్య ప్రణాశేపి తపోదానావశేషతా ।
పురుషస్య తు యస్యాస్తి స తిష్ఠేద్ద్వాపరే యుగే ॥ XV - 18

తపోదానాలు మాత్రమే కలవాడు ద్వాపర యుగానికి చెందుతాడు.

దయా సత్యతపాంసీతి త్రయః పాదా వినిర్గతాః ।

దాన మాత్రావ శేషశ్చ యస్యాభూత్స కలౌ యుగే ॥ XV - 19

దాన గుణం మాత్రమే కలవాడు కలియుగానికి సంబంధించినవాడు. అలాగే -

ఇత్థం విజ్ఞైర్యుగే ప్రోక్తం కృతే సత్త్వగుణా జనాః ।
త్రేతాయాం ద్వాపరే చస్యుః రజస్సత్త్వ గుణాస్తథా ॥ XV - 20
రజస్తమో గుణాశ్చైవం కలౌ కేవలతామసాః ।
ఏకై కస్మిన్యుగే చైవం సన్త సర్వయుగా జనాః ॥ XV - 21

సత్త్వగుణం కలవారు కృతయుగ వాసులని, సత్త్వ రజోగుణాలు కలవారు త్రేతాయుగ వాసులని, రజస్తమోగుణాలు కలవారు ద్వాపర యుగ వాసులని, తమోగుణప్రధానులు కలియుగ నివాసులని చెప్పబడుచున్నారు.

కృతే త్రేతాయుగాదీని త్రేతాయాం ద్వాపరే తథా ।
కలావపి కృతాదీని భవన్తి గుణభేదతః ।
సర్వేషు సన్తి సర్వాణి యుగేష్వపి యుగాని చ ॥ XV - 22

ఆయా గుణాలు కలవారు అన్ని కాలాల్లోనూ ఉంటారు. కాబట్టి ప్రతి యుగంలోనూ అన్ని యుగాలకు సంబంధించిన జనులు వుంటారని గ్రహించాలి. అంటే గుణాలను బట్టి కృతయుగంలో త్రేతాదులైన మూడు యుగాలున్నట్లే కలియుగంలోనూ తక్కిన మూడు యుగాలు వున్నవని గ్రహించాలి.

ప్రత్యేకం యుగసద్భావస్సత్యంచేన్మానవాః కృతే ।
చతుష్పాద్ధర్మ యుక్తాస్స్యు స్త్రేతాయాం త్ర్యంఘ్రిధర్మగాః ॥ XV - 23
ద్వాపరే చ జనాస్సర్వే ద్విపాద్ధర్మ యుజస్తథా ।
కలావప్యేక పాద్ధర్మాః కిన్త్వేవం నైవ దృశ్యతే ॥ XV - 24

అట్లుగాక ఒకసారి ఒకే యుగం వుంటుందని నమ్మినట్లయితే కృతయుగంలో అందరూ నాలుగు పాదాల ధర్మాన్ని అనుసరించే వారయివుండాలి. త్రేతాయుగంలో అందరూ మూడు పాదాల ధర్మాన్ని, ద్వాపర యుగంలో వున్నవారు రెండు పాదాల ధర్మాన్ని, కలియుగంలో వున్నవారందరూ ధర్మం యొక్క ఒకే పాదాన్ని అనుష్ఠించే వారుగానుండవలసి వుంటుంది. కాని అలా కనిపించటం లేదు.

కృతాది సర్వయుగాల్లోనూ సత్యాసత్యాలు, జ్ఞానాజ్ఞానాలు, హింసాహింసలు కనిపిస్తూనే వున్నాయి.

హిరణ్యకశిపుస్తస్య పుత్రః ప్రహ్లాదనామకః ।
బభూవతురుభౌ లోకే కృతే దుర్జన సజ్జనౌ ॥ XV - 27
త్రేతాయుగే రామచన్ద్రో జాతో ఽభూద్ధర్మ తత్పరః ।
దశకణ్ఠో రావణో ఽపి ప్రాణిహింసా ధురంధరః ॥ XV - 28
శ్రీకృష్ణో ధర్మరాజశ్చ దుర్యోధన తదానుజాః ।
ద్వాపరే భువి సంభూతాః లోకోద్ధారక కణ్టకాః ॥ XV - 29

హిరణ్యకశిపుడు దుష్టుడు, ప్రహ్లాదుడు శిష్టుడు. వీరిరువురు కృతయుగంలోనే వుండేవారు. రాముడు, రావణుడు ఒకే త్రేతాయుగంలో వుండేవారు. అట్లే శ్రీకృష్ణ ధర్మజాదులు, దుర్యోధనాదులును ద్వాపరయుగంలో వుండేవారు.

భగవాన్ శఙ్కరాచార్య గాన్ధీతుల్య మహాజనాః ।
దేశదేవతయోర్భక్తా ఉదభూవన్ కలౌయుగే ॥ XV - 30
ఔరఙ్గజేబు నామాపి దురాత్మా యవనాధిపః ।
కలౌ యుగే సముద్భూతో దేవమన్దిర భఞ్జకః ॥ XV - 31
ప్రత్యేకం యుగసద్భావ ఏతేషాం సమ్భవః కథమ్ ।
ఏతైర్మహాత్మభిస్తత్తద్యుగే ధర్మః ప్రవర్తితః ॥ XV - 32

ఈ కలియుగంలో గాంధి, శంకరాచార్యుల వంటి మహాత్ములు పుట్టారు. దేవాలయ ధ్వంసకుడైన ఔరంగజేబు కూడా ఈ యుగంలోనే జన్మించాడు. యుగలక్షణాలు పూర్తిగా వేరువేరయినట్లయితే విరుద్ధధర్మాలు కలిగినవారు ఒకే యుగంలో ఎలా వుంటారు ? పరీక్షిత్ కాలంలో ప్రవేశించిన కలిపురుషునికి రాజు జూదం, ప్రాణి హింస, మద్యపానం, దుష్టస్త్రీ సాంగత్యం అనే నాలుగు స్థానాల్లో మాత్రమే సంచరించడానికి అనుమతిచ్చాడు. కాబట్టి ఎవనిలో దుర్గుణాలున్నాయో, వానిలో కలి వుంటుందని భాగవత వాక్యానికి అర్థం. అలాగే - సత్య, ధర్మ, దయా, జ్ఞానాలు, భక్తి వైరాగ్యాలు కలవారి చెంతకు పతివ్రతలు, ఏకపత్నీవ్రతులు, జీవకారుణ్యాది గుణాలు కల ఉత్తమ పురుషుల చెంతకు పోకూడదని కూడా పరీక్షిత్తు కలిని శాసించినాడు.

భగవంతుని స్మరించనివారు కృతయుగంలో వున్నా కలియుగ మానవులే. భగవంతుని స్మరించువారు కలియుగంలో ఉన్నా కృతయుగం వారే. ఈ వాదనకు ప్రోద్బలకంగా ఈ క్రింది ఉదాహరణలను పేర్కొంటున్నారు.

మధురామ్ల కషాయాది ఫలపుష్ప దశాఖినః ।
ఏకరూపేణ వర్తన్తే కృతాదిషు యుగేషు తే ॥ XV - 55

పలురకములు గల ఫలముల నిచ్చే చెట్లు అన్ని యుగాల్లోనూ ఒకే తీరుగ వున్నాయి. యుగాలు మారినా వాటి రుచి మారుటలేదు. అట్లే గజాశ్వాది జంతువుల్లోనూ వాటిగుణాలు మారడం లేదు. కాక, హంసాది పక్షుల్లో యుగభేదం చేత విరూపత్వం కలగటం కాక, హంసాది పక్షుల్లో యుగభేదం చేత విరూపత్వం కలగటం లేదు. అలాంటప్పుడు మానవుల్లో మాత్రం ఈ భేదం ఎందుకు కలుగుతుంది ?

చేపలు, కప్పలు మొదలైన జంతువుల్లో లేని మార్పు యుగభేదంచే మానవుల్లో మాత్రమే ఎందుకు కలుగుతుంది ? పశుపక్ష్యాదులు అనాదినుండి ఒకే నియమాన్ని అనుసరిస్తున్నాయి. కాని వాటిల్లో మార్పులేదు.

మానవులలా కాక తమ నియమాలు వదలి స్వేచ్ఛగా చరించడం చేత కలి ప్రవేశించాడు. నాలుగాశ్రమాల ధర్మాలని వదలడం చేత ప్రజలు పశుప్రాయులైనారు.

ఆత్మనోవిస్మృతిర్జ్ఞేయా కలిర్ద్వాపరమాత్మనః ।
స్మృతిర్ధర్మోదయస్త్రేతా కృతం ధర్మ ప్రబోధనమ్ ॥ XV - 62

ఆత్మను మరవడం కలియుగం. మరువకుండటం ద్వాపరయుగం. ధర్మాన్ని ఆచరించటం త్రేతాయుగం. ధర్మాన్నాచరిస్తూ ప్రబోధించటం కృతయుగమగునని గుర్తించాలి.

ఈ యుగాలను గూర్చి ఈ విధంగా పూర్వమెవరూ చర్చించలేదు. శ్రీ మలయాళ యతీంద్రుల అపూర్వమైన ఆలోచనా సరళికి, అద్భుత తార్కిక వాదానికి ఇదొక ఉదాహరణ మాత్రమే.

షష్ఠాధ్యాయం

# ఉపసంహారము

ప్రాచీన వైదిక సాహిత్యమైన భారతాంతర్గత భగవద్గీత, తను రూపు దాల్చినది మొదలు భారతీయ జనజీవన స్రవంతిని ఒక తాత్త్విక,సాంస్కృతిక విధానానికి గిరిగీచి నిలబెట్టిన మహాగీత. గీతలోని ప్రబోధం కేవలం భారతదేశానికి మాత్రమే పరిమితం కాదని, దేశకాలాదుల పరిధులదాటి, విశ్వమానవుని పరమోన్నత స్థితికి చేర్చి, తరింపజేసే జ్ఞాన శిఖ అని చెప్పడానికి ఆ గీతకు భారతీయ, భారతీయేతర భాషలలో వెలువడిన వ్యాఖ్యానాలు, అనువాదాలు, తార్కాణాలు. సుగంధము, సౌకుమార్యము ఒకే పువ్వులో ఇమిడినట్లే సంస్కృత భాషలోని సారళ్యము, శ్రుతి సహిత సారాంశము రెండూ భగవద్గీతలో ప్రతిఫలించాయి.

పంచమవేద మనిపించుకున్న మహాభారతంలో మోహవశుడైన ఒక పాత్రను కర్తవ్యోన్ముఖునిగా చేయడానికి మరొక పాత్రచేసిన ప్రయత్నమే భగవద్గీత. అటువంటి గీత ఒక సాహితీ ప్రక్రియగా రూపుదాల్చి గీతా సాహిత్యమనే ప్రక్రియకి నాంది పలికింది. పురాణ సాహిత్యంలో మొక్కగా ఎదిగి, కావ్య సాహిత్యంలో తనకంటూ ఓ విలక్షణతను సంపాదించు కొంది. మానవాళిని సద్ధర్మ పథంవైపు నడిపించే మహాత్ముల బోధనలు గీతలుగా మారడం ఈ సాహితీ ప్రక్రియా ప్రాశస్త్యాన్ని చాటుతుంది. శివగీత, విష్ణుగీతలతో ఆరంభమై రమణగీత, సాయి గీతల వరకు ప్రయాణించి జ్ఞానజ్యోతులను వెలిగించిన ఈ ప్రక్రియా క్షేత్రంలో వెలిసిన మరో జ్యోతి శ్రీ మలయాళ యతీంద్ర గీత.

మాయామోహితుడైన మానవునికి స్వరూపాను సంధానం కావించి పరమ పురుషార్థ ప్రాప్తికి అవసరమైన మార్గాలను నిర్దేశించడం గీతల ప్రధాన కర్తవ్యం. పరమ పురుషార్థమైన మోక్షాన్ని కర్మ, భక్తి, యోగ, జ్ఞాన మార్గాలతో ఎలా చేరుకోవాలి ? అనే ప్రశ్నకి అధికారి భేదాన్ని బట్టి అనుసరణీయమైన మార్గాల్ని పరిచయం చేస్తూ, సూక్ష్మాతి సూక్ష్మమైన వేదాంత భావనలని సామాన్య పాఠకునికి బోధించడమనేది గీతల మరో ఉద్దేశ్యం. సార్వకాలీన సత్యాలను తెలియచేస్తూ

సమాజ శ్రేయస్సుకి సామాన్యుని సైతం చైతన్యవంతుణ్ణి చేసిన మహా ఆయుధం కూడా అదే.

వేదాంత మతాన్ని పునరుజ్జీవింపచేసిన శంకరుల సంప్రదాయానికి చెందినవారు అసంగానందులు. స్వభావంలో అసంగానందులే అయినా, జన్మతః మలయాళీ అయినందున మలయాళస్వాములుగా వారు ఆంధ్రదేశంలో ప్రసిద్ధిని పొందినారు. వీరి బోధనల సారాంశమే శ్రీ మలయాళ యతీంద్ర గీత.

స్థూలంగా అధ్యాయాల సంఖ్యలోనూ, పేర్లలోనూ, స్వరూపంలోనూ, చాలావరకు విషయాలలోనూ భగవద్గీతనే అనుసరించినా, తనకంటూ కొన్ని ప్రత్యేకతలను నిలుపుకొన్నది శ్రీ మలయాళ యతీంద్ర గీత. సిద్ధాంతం అద్వైతమే అయినా, పరసిద్ధాంత పరిహాసంగానీ, పరమత ద్వేషం కానీ ఎక్కడా కనపడవు. వికసిస్తున్న లౌకిక విజ్ఞానానికి పరిధులు లేనట్లే పారమార్థిక భావనలు కూడా నిరవధికాలూ, విశ్వవ్యాపకాలు అని నిరూపిస్తూ ఖండాంతరాల్లోని మతాన్ని కూడా తన పరిధిలోనికి తెచ్చుకున్నది ఈ గ్రంథం. కేవలం ఆధ్యాత్మిక లేదా పారమార్థిక భావనలకి మాత్రమే పరిమితమైన గ్రంథం కాదిది. మానవుడు మానవుడిగా మనుగడ సాగిస్తూ, భగవత్ప్రసాదమైన ప్రకృతి సంపదలని జాతి భేదం లేకుండా అనుభవించడానికి మార్గాన్ని సుగమం చేసే పుస్తకమిది. అంతేకాక సామాజిక న్యాయసాధనకి అడ్డు గోడలైన మూఢ విశ్వాసాలను, అంధ విశ్వాసాలను పారద్రోలడానికే పుస్తకమయిన గ్రంథరాజమిది.

శ్రీ మలయాళ యతీంద్ర గీత ప్రకారం పరమ పురుషార్థం మోక్షం, కర్మ, భక్తి, యోగ, జ్ఞానాలు మోక్షానికి సాధనలు. ఈ సాధనలన్నీ అనుష్ఠేయాలు కనుక అనుష్ఠానమే మోక్షానికి ప్రధాన సాధనమని మలయాళ యతీంద్రుల సిద్ధాంతం.

> నానుష్ఠానాత్పరం కార్యం త్రిషు లోకేషు విద్యతే ।
> నానుష్ఠానాత్పరోధర్మో నానుష్ఠానాత్పరం తపః ॥ I. 24

మోక్షానికి బ్రహ్మచర్యాద్యాశ్రమాలు, బ్రాహ్మణాది జాతులు, లింగభేదాలు కారణాలు కావనీ, భావశుద్ధి, ఆత్మశుద్ధి, హృదయ శుద్ధి ఉన్న ప్రతి

ఒక్కడూ మోక్షానికి అర్హుడే అని అసంగానందుల విశ్వాసం. మోక్షం కోసం సన్న్యసించాలనడం సహజం. అయితే మోక్షాన్ని కూడా సన్న్యసించాలంటారు అసంగానందులు. ఎందుకంటే ముక్తి ప్రతివానికీ సహజసిద్ధమైనది. అజ్ఞానం వల్ల స్వస్వరూపం మరచిపోయిన జీవుడు బంధంలో చిక్కుకుంటున్నాడు. తాను 'సదా ముక్తుడే' అన్న జ్ఞానం అతనికి దృఢపడినపుడు తన స్వస్వరూపాన్ని పొందుతాడు. కనుక అతడు ప్రత్యేకంగా మోక్షాన్ని కోరవలసిన అవసరం ఉండదు. అందుకే మోక్షాన్ని కూడా సన్న్యసించాలి అని అంటారు స్వాములవారు.

మోక్షస్థితిని చెబుతూ ఒకచోట మోక్షమనే సౌధానికి కర్మ, భక్తి, యోగ, జ్ఞానాలు నాలుగంతుస్తులనీ (IX - 23), మరొకచోట ముక్తి మంటపం కర్మ, భక్తి, యోగ, జ్ఞానాలనే స్తంభాలపై నిలిచి ఉన్నదనీ (IX - 26) ఇంకొక చోట మోక్షమనే కామధేనువు కర్మాది నాలుగు పాదాలమీద (IX - 28) నిలబడి వున్నదనీ చెప్పడం జరిగింది. అయితే మోక్షసౌధం నాలుగంతస్తులు కల్గివున్నదన్నపుడు కర్మవల్ల భక్తి, భక్తివల్ల ధ్యానం, ధ్యానం వల్ల జ్ఞానం, జ్ఞానం వల్ల మోక్షం సిద్ధిస్తాయని గ్రహించాలి. మోక్షాన్ని నాలుగు స్తంభాల మంటపం అని, నాలుగు పాదాల కామధేనువు అని ఉపమానించినపుడు సాధన మార్గాల్లో ఒకటి ప్రధానము, మరొకటి అప్రధానమూ అని కాక నాలుగు యోగాలనూ చక్కగా అనుష్ఠించినపుడే మోక్షసిద్ధి అవుతుందని తాత్పర్యము. సన్న్యాసి అన్నవాడు ప్రాపంచిక వ్యవహారానికి ఏ మాత్రం సంబంధంలేని వాడు కాకూడదని, సమాజంలో తానూ ఒకడు కాబట్టి సమాజంలోని అందరూ తరించాలని కోరుతూ సమాజ శ్రేయస్సుకు తనవంతు కృషిని అతడు నెరవేర్చాలనే మలయాళ స్వాముల అభిప్రాయం, స్వామి వివేకానందుల, స్వామి రామతీర్థుల ప్రబోధాలని జ్ఞాపకం చేస్తుంది. స్వతంత్ర సంగ్రామ సమయంలో దేశవిమోచనానికి; జాతి భేద నిర్మూలనానికి కంకణం కట్టుకున్న శ్రీ నారాయణ గురుదేవుల బోధనలకి మలయాళస్వాములవారు ప్రభావితులు కావడంలో ఆశ్చర్యం లేదు. ఆ ప్రభావమే స్వాములవారు అనేక సామాజిక కార్యక్రమాల్లో పాల్గొనడానికి కారణమైంది. జాత్యాదిభేద దృష్టి రూపుమాసినపుడే మన వ్యవస్థ సర్వతో ముఖాభివృద్ధిని

సాధిస్తుందని వారి ప్రగాఢ విశ్వాసం. అటువంటి మార్పు నిర్బంధంతో కాక, జ్ఞాన ప్రసార, ప్రచారాలతోనూ, ఉన్నతమైన భావాలను సహేతుకంగా, యుక్తా యుక్తంగా వివరించడం ద్వారానూ తీసుకు రావాలని వారి ఆశయం. తమ అభిప్రాయాలకనుగుణంగా తామే స్వయంగా కార్యరంగంలో దిగి, వర్ణలింగ భేదాలు పాటించకుండా అందరికి జ్ఞానదానం చేయడానికి సంస్కృత పాఠశాలలు, బ్రహ్మవిద్యా పాఠశాల, కన్యాగురుకులం స్థాపించారు. అలాగే సనాతన వేదాన్త సభల ద్వారా జాతి లింగ భేదాలు లేని సమాజ నిర్మాణం చేయడానికి మహోద్యమాన్ని నడిపారు మలయాళ స్వామి. ఈ విధంగా వారి పేరిట రూపుదాల్చిన శ్రీ మలయాళ యతీంద్రగీత కేవలం ఆధ్యాత్మిక భావనలకే కాక, సమాజ రుగ్మతలను తొలిగించే సాధనంగా కూడా ఉపయోగపడింది.

సంస్కృతంలో రచనాప్రక్రియ తగ్గిపోయిన దశలో వేదాంత సిద్ధాంతాలతో సంఘ సంస్కరణాత్మకమయిన ప్రబోధాలతో 'శ్రీ మలయాళ యతీంద్ర గీత' వెలుగు చూడటం బహుధా ప్రశంసనీయం. ఈ విధంగా 20వ శతాబ్దంలో వెలుగు చూసిన సంస్కృత గ్రంథాలలో శ్రీ మలయాళ యతీంద్ర గీత ఒక విశిష్టమైన స్థానాన్ని ఆక్రమించిందని నిస్సంశయంగా చెప్పవచ్చు.

- సమాప్తం -

# యతీంద్రుల జీవితం

శ్రీ మలయాళ స్వామి కేరళ రాష్ట్రం, త్రిచూరు మండలం లోని సుప్రసిద్ధ పుణ్యక్షేత్రమైన గురువాయూరుకు దగ్గరలోని ఎన్ గండ్యూరు అనే గ్రామంలో కరియప్ప, నొట్టియమ్మ అనే దంపతులకు క్రీ.శ. 1885 మార్చి 27వ తేది (ప్రార్థివ నామ సంవత్సరం చైత్ర శుద్ధ ఏకాదశి శుక్రవారం) న జన్మించారు. వారిది మధ్య తరగతి కుటుంబం. తల్లిదండ్రులు సంప్రదాయాన్ని గౌరవించేవారు. వ్యవసాయం జీవనాధారంగా వైద్యవృత్తితో ప్రజలకు సేవలు చేస్తూ కాలం గడిపేవారు.

కరియప్ప, నొట్టియమ్మ దంపతులకు నలుగురు సంతానం. వారిలో ముగ్గురు కొడుకులు, ఒక కూతురు. మూడవ వాడు మలయాళ స్వామి. స్వామికి ఆయన పెద్దలు పెట్టిన పేరు వేలప్ప. వేలప్ప చిన్నతనం నుండి విరాగి లక్షణాలతో వుండేవాడు. ఒకసారి ఒక బైరాగి ఈ పిల్లవానికి 'సర్వసంగ పరిత్యాగి' అయ్యే లక్షణాలు ఉన్నాయని చెప్పాడట. వేలప్ప అందరు పిల్లల్లాగా అల్లరి చేయకుండా ఏకాంతంగా కూర్చొని ఏదో ఆలోచించుకుంటూ వుండేవాడు. గ్రామంలో జరిగే పురాణ కాలక్షేపాలకి తప్పకుండా వెళ్ళేవాడు. చిన్నతనంలో ఒక బోయవాడు రెండు పక్షులని అమ్ముతుంటే చూసి వెంటనే వాళ్ళమ్మ దగ్గర డబ్బుతీసుకుని ఆ రెంటిని కొని స్వేచ్ఛగా వదిలేశాడు. ఈ సంఘటన ''దయగల హృదయమే భగవన్నిలయం'' అన్న ఆయన ప్రఖ్యాత సూక్తికి ప్రథమోదాహరణ మయ్యింది.

వేలప్ప పెద్దల అనుమతితో సంస్కృతం నేర్చుకోవటానికి పెరింగోట్కరలోని శ్రీ సిద్ధ శివలింగ గురుస్వామి దగ్గర శిష్యుడిగా చేరాడు. ఆయన భక్తి ప్రపత్తులను చూసి ఆశ్రమంలోని వారంతా ఆయన్ని భక్తన్ (భక్తుడు) అని పిలిచేవారు. ప్రతిరోజూ సత్కర్మానుష్ఠానం, భక్తితత్పరత, పంచశుద్ధులు, పంచనియమాలని క్రమం తప్పకుండా పాటించే వేలప్పకు శ్రీ శివలింగ గురుడు ఒక మంచిరోజున మంత్రోపదేశం, యమనియమాది అష్టాంగ విధులు, యోగ రహస్యాలు, మహావాక్యాలు బోధించాడు.

కొన్ని సంవత్సరాల తర్వాత శ్రీ సిద్ధ శివలింగ గురువు వేలప్పను తన గురువు, సాక్షాత్ పరబ్రహ్మ స్వరూపుడు అయిన శ్రీ నారాయణ గురువును దర్శించమని సెలవిచ్చాడు. ఆయన ఆజ్ఞప్రకారం వేలప్ప 'వరకల'లో వున్న శ్రీ నారాయణ గురుదేవుల దగ్గరకు వెళ్లి ఫల పుష్పాదులు సమర్పించి -

ఓం బ్రహ్మణే మూర్తిమతే శ్రుతానాం శుద్ధి హేతవే ।

నారాయణ యతీంద్రాయ తస్మై శ్రీగురవేనమః ॥

అని సాష్టాంగ ప్రణామం చేశాడు. ఆ బ్రహ్మచారిని శ్రీ నారాయణ గురుదేవుడు ''వత్సా ! నీకు త్వరలో బ్రహ్మానుభవం అవుతుందని దీవించాడు. వేలప్ప అక్కడ కొంతకాలం గడిపి తిరిగి శ్రీ సిద్ధశివలింగ గురువులను దర్శించి వారి అనుమతితో స్వగ్రామానికి చేరాడు.

గ్రామంలో అనారోగ్యంతో వున్న తన తల్లికి కొంతకాలం సేవచేసి, ఒకనాటి రాత్రివేళ అంతర్వాణి ఉపదేశంతో అప్పటికప్పుడే తీర్థయాత్రలకు బయలుదేరాడు. కర్నాటకం నుంచి హరిద్వారం బ్రహ్మకపాల తీర్థం, కాళికాక్షేత్రం నుంచి కాశి మొదలైన ఉత్తర దేశ క్షేత్రాలని దర్శించి, చివరికి తిరుమల కొండకు చేరి, అక్కడ గోగర్భంలో క్రీ.శ. 1913 డిసెంబరు మూడవ వారంలో కఠోర తపోదీక్షను ప్రారంభించాడు. స్వామి గోగర్భంలోనే కాక తిరుమలలోని ముఖ్యమైన ఇతర తీర్థాల్లో కూడ తపస్సు చేస్తూ కొంతమంది విద్యార్థులకు 'శబ్దమంజరి', 'రామోదంతం' మొదలైన సంస్కృత పాఠాన్ని బోధిస్తుండేవాడు. అప్పుడే కోటంబేడులో వ్యాపించిన కలరా వ్యాధి నివారణకు, పశువులకు వచ్చే పిల్లి సరకు వ్యాధి నివారణకు స్వామి ఎంతగానో సేవ చేశారు. గోగర్భంలోనే తన వేదాంత రచనా వ్యాసంగాన్ని కూడా ప్రారంభించాడు. ఎక్కడో మలయాళ దేశం నుంచి వచ్చి ఏకాంతంగా తపస్సు చేసుకొంటున్న స్వామి గనుక అక్కడి ప్రజలు స్వామిని మలయాళస్వామి అని పిలవటం ప్రారంభించారు. అదే పేరే ఆయనకు స్థిరపడింది.

దాదాపు 13 సంవత్సరాలు తపస్సు చేసిన తర్వాత భక్తులకోరికపై శ్రీ మలయాళ స్వాములవారు 1926వ సంవత్సరంలో, తిరుపతి - శ్రీకాళహస్తి మార్గంలో ఏర్పేడు దగ్గర శ్రీ వ్యాసాశ్రమం స్థాపించారు. 1927 ఫిబ్రవరి నుంచి 'యథార్థ భారతి' అనే ఆధ్యాత్మిక మాసపత్రికను ఆశ్రమం తరపున ప్రారంభించారు. 12.9.1928న సంస్కృత పాఠశాలను స్థాపించారు. 2-2-1936లో స్వామి 'శ్రీ అసంగానంద' పేరుతో సన్న్యాసాన్ని స్వీకరించి ఈ ఆశ్రమానికి దాదాపు వందకుపైగా అనుబంధశాఖలు, బ్రహ్మ విద్యా కేంద్రాలు వెలిసేలా చేశారు. 1945లో బ్రహ్మ జ్ఞాన పిపాసువుల కోసం బ్రహ్మ విద్యా పాఠశాలని స్వామి ప్రారంభించారు. 1947 నుండి ప్రొద్దుటూరు లోని శిష్యబృందము స్వామి పేరుతో

ఒక సంస్కృత కళాశాలని, పండిత శిక్షణా కళాశాలని, సంస్కృతోన్నత పాఠశాలని నడుపుతున్నది. 1-12-1955లో శ్రీ వ్యాసాశ్రమంలోనే జిజ్ఞాసువులయిన బాలికలకోసం కన్యాగురుకులాన్ని స్వామి ప్రారంభించారు.

ప్రాచీన భారతీయ ఆధ్యాత్మిక పరంపర పరిరక్షణ, ప్రచారాలకోసం సంస్థల నిర్మాణ కార్యక్రమాల్లో ఎంతగా తలమునకలయినా, వారిలోని తాత్త్విక రచయిత వూరుకోలేదు. ఎన్నో ఉద్గ్రంథాలను రచించారు. వారి రచనలను రెండు రకాలుగా విభజించవచ్చు. 1. స్వతంత్ర గ్రంథాలు 2. వ్యాఖ్యాన గ్రంథాలు.

## స్వతంత్ర గ్రంథాలు :

శుష్క వేదాంత తమో భాస్కరము, స్వబోధ సుధాకరము, ఓంకారము, ధర్మసేతువు, ప్రశ్నోత్తర మాణిక్యమాల, శ్రీ బాలయోగిని, లోకోద్ధారకము, బ్రహ్మవిద్య, గురుభక్తి ప్రభావము, గృహస్థాశ్రమ ధర్మము, బ్రహ్మచర్యము, కర్మసిద్ధాంతము, ఉపదేశామృతము, నిర్విఘ్న యోగసిద్ధి, చాతుర్మాస్య మాహాత్మ్యము, వైరాగ్య బోధోపరతులు, జీవన్ముక్తి, జ్ఞాన యజ్ఞము, మహామంత్రాతీత ప్రభావము, ప్రారబ్ధకర్మ, ఈశ్వర కృప, మాయను మాయ చేయుట, నిర్వాణ నిలయము, ప్రమాదమునొందకుడు, గుణత్రయము గుణత్రయా తీతము, సమాధిచేయువిధానము, శ్రీ వేంకటేశాది పూజా పంచరత్నమాల.

## వ్యాఖ్యాన గ్రంథాలు :

కఠోపనిషత్తు, ముండకోపనిషత్తు, మాండూక్యోపనిషత్తు, భగవద్గీత, నారద భక్తి సూత్రములు.

గ్రంథ ముద్రణకనుకూలంగా స్వామి చిత్తూరు తపోవనంలో 1945న వేదవ్యాస ముద్రాక్షర శాలను స్థాపించారు.

శ్రీ స్వాములవారు తమ వేదాంత భేరిని మ్రోగించడానికి దక్షిణ భారతదేశంలో 36 సనాతన వేదాన్త జ్ఞాన సభలను నిర్వహించారు. ఆ సమయంలోనే స్వామి ఒకసారి బందరులో గాంధీ మహాత్ముని కలవడం జరిగింది. శ్రీ గురు దేవులు 5 చాతుర్మాస్య వ్రతాలను నిర్వహించారు. కారణ జన్ములయిన మహర్షి సద్గురు శ్రీ మలయాళ స్వాములవారు 12-7-1962 అర్థరాత్రి ఉత్తరాయణ శయనైకాదశి దినాన తమ పార్థివ శరీరాన్ని చాలించి బ్రహ్మైక్యం పొందారు.